# వారణాసి శ్రీ రామ కృష్ణ
# అఫ్ అమరావతి కధలు కబుర్లు
# 15-7-24 to 15-08-24



12  పిడుగు రాళ్ల పద్మ పై పిడుగు పడింది " 15-08-24

పొన్న పల్లి పద్మ ,  పిడుగు రాళ్ళలో ఉండటం వల్ల బంధు మిత్రులచే పిడురాళ్ల  పద్మ  అని పిలవబడుతూ వుంది , "ఈ రోజు ఆదివారం కదా?"  అనుకుంటూ పద్మ ఎనిమిదింటి కి   నిద్ర లేచి రోజు  చూడాల్సిన శుభ సకుణాలైన  ఫోను దేముళ్ళని  - వాట్స్

అప్ ను ఫేస్బుక్కు ను చూసి " అబ్బాయి పాల పాకెట్ తెచ్చి పెట్టి ఉంటే కాఫీ తాగు దాము" అనుకుంటూ కిచెన్ లోకి వచ్చింది . పాల పాకెట్ లేదు ." అంటే పిల్లడు బయటి కి పోయివుంటాడు " అనుకుంటూ ఆమె వరండాలోకి వచ్చింది . ఆపాటికి అంట్లు తోమి బట్టలు పిండి ఆరవేస్తూ వుండే పని మనిషి అక్కుపక్షి అచ్చెమ్మ కనపడక పద్మకు తిక్క రేగింది .
పద్మ వాళ్ల అబ్బాయి పేరు మహేశ్వర్ .హైదరాబాద్ లో వుద్యోగం చేస్తూ శని ఆది వారాలు ఇంటికి వచ్చి పోతూ ఉంటాడు . అక్కుపక్షి అచ్చెమ్మ కనపడక పద్మమ్మకు తిక్క రేగుతున్న సమయంలోనే ఎదురింటి శంభులింగము గారు గేట్ తోసుకొని లోపలికి చొచ్చి " ఏడీ మీ అప్రయోజకుడు ? మీ శుంఠ మా అమ్మాయిని లేపుకు పోయినట్లున్నాడు - మా మహాలష్మి ఇంట్లో కనపడటం లేదు . ఫోన్ ఎత్తటం లేదు " అని అరిచాడు . శంభులింగం గారు తన కూతురు ఐన మహాలష్మి కి ఐఏఎస్ రేంజ్ సంభందాలు చూస్తూ వున్నాడు . కానీ ఈ లోగానే తనకూతురు - ఎదురింటి వారి అబ్బాయి మహేశ్వరాన్ని వలపు చూపులు చూస్తున్నది అని ఆయనకు తోచి " వాడొట్టి అప్రయోజకుడు " అని మహేశ్వరాన్ని వర్ణించి - కూతురి మనసు మలుపుతూ వస్తున్నాడు . సరే పద్మ మటుకు ఏమన్నా గుడ్డిదా ? తనకొడుకు ఎదురింటి ఎండుమిరపకాయని దేఖుతున్నాడని కని పెట్టేసింది . మహాలష్మి ఎర్రగా సన్నగా ఉంటుంది . "ఈ పిల్లను ఎవరు చేసుకుంటాడో వాడు ఎండు మిరపకాయల పొగ తగిలినట్లు ఉక్కిరి బిక్కిరి అయి చచ్చి పోతాడు . బ్రతికి బాగు పడడు" అంటూ పద్మ తన కొడుకుకు నూరిపోస్తూ అతని మనసు

మళ్లిస్తూ వస్తున్నది .కోటీశ్వరు ల ఇంటి పిల్లను కోడలిగా
తెచ్చుకోవాలని పద్మ కు కోరిక .
ఇహ అట్టే ఉపోద్ఘాతము ఏమీ లేకుండా పద్మ ఇంట్లోకి వెళ్లి చూసి--
కొడుకు ఇంట్లో లేడని పాల పాకెట్ అతని దిండు మీద ఉందని
కనుగొని వచ్చింది .

శంభులింగం గారు ఫోన్ చేస్తే ఆయన కూతురు ఎత్తలేదు . పద్మ
ఫోన్ చేస్తే ఆమె కొడుకు ఫోను యెత్తి " ఆమ్మా ఏమనుకోకు -
ఇదిగో నీ కోడలితో మాట్లాడు " అని ఫోను మహాలష్మి కి ఇచ్చాడు .
మహాలష్మి గొంతు విని --
" అనుకున్నంతా అయ్యింది . మీ అప్రాయోజకుడు మా దాన్ని
లెవా తీసుకు పోయాడు " అని శంభులింగం గారు ఆక్రోశించాడు .
ఇప్పుడు పద్మ నెత్తిన పిడుగు
పడి నట్లు అయ్యిందని - అందుకే ఈ కథ పేరు "పిడుగు రాళ్ల పద్మ
పై పిడుగు పడింది " అని పేరు పెట్టాను అని మీరు అనుకుంటే
అనుకోవచ్చు .

మహాలష్మి -" తన అత్తగారికి నమస్కారాలు అవీ తెలిపి
ఆశీర్వచనాలు అవీ కోరి - "మీ అబ్బాయి - నేనూ  వచ్చే  శ్రావణ
శుక్రవారం మీ ఇంటికొస్తా మండీ   " అనే ప్రకటన /హామీ ఇచ్చింది
. రావొద్దు అని పద్మ అనలేక పోయింది . మహాలష్మి అనే ఎండు
మిరపకాయ ఇంకా మాట్లాడుతూ  " అత్తా గారూ --   మాకు
అంట్లు తోమి బట్టలు ఉతక టానికి ఉంటుందని -  మనిషి అక్కు
పక్షి అచ్చెమ్మ ను కూడా మాతో లేపు కొచ్చేసాం .  ఇంతకు

ముందే దానికి దానిమొగుడికి పడటం లేదట . ఇక్కడ మాతోనే ఉండి ఫదిళ్ళలో పాచి పని చేసుకొని స్వతంత్రంగా బతుకుతానంటోంది . దాని ఫోనును డ్రైనేజీ లో పారేసింది . దాని మొగుడు వస్తే మీరే ఎదో సర్ది చెప్పి పంపేయండి " అని చెప్పింది .

" పోయే వాళ్లు పోక నా పనిమనిషిని లేవతీసుకు పోవటం ఏమిటి ? ఇప్పుడూ -మళ్ళీ పని మనిషి దొరికే వరకూ ఈ అంట్లు -ఈ బట్టలు ఉతుకుడు ఎవరు చేస్తారు " అనే ఆలోచన రాగానే పద్మకి నెత్తి మీద పిడుగు పడ్డట్లు అనిపించింది . పిడుగు రాళ్ల పద్మకు ఆలా అనిపించినాక నే ఈ కధకు " పిడుగు రాళ్ల పద్మ పై పిడుగు పడింది " అని పేరు పెట్టాను . చిత్తగించారా ?
" తన కోడలు ఎండు మిరపకాయ లాంటిదని - ఎండు మిరపకాయలా పొగలు కక్కి అందరూ ఉక్కిరి బిక్కిరి అయి చచ్చి పోయేట్లు చేస్తుందని " తాను చేసిన వూహ అక్షర సత్యము అయ్యేట్లు వున్నదని తోచినాక పద్మకు పిడుగు మీద మరో పిడుగు పడినట్టు అని పించింది .ఇప్పుడు ఈ కథ పేరు " పిడుగు రాళ్ల పద్మపై పిడుగు మీద పిడుగు" గా మార్చి చదువుకోండి .

వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి స్వంత కథ
The story has more then 200 likes in facebook

11.అమరావతి ధీమా శంకరం 09-08-24

మావూరు అమరావతి అని మీకు తెలుసు . మావూరి మొత్తానికి ధీమా నిచ్చే అయన శంకరం గారు అని ఒకరున్నారు .

ఒకనాడు నేను అయన వద్దకు వెళ్ళాను. అయన ఏమి చెప్పినా వింటాడు . అడ్డు ప్రశ్నలు వేయడు .చివరికి మనకి ఎదో ధీమా ఇచ్చి పంపుతాడు కాబట్టి వెళ్ళాను .
నేను ఆయనతో" అయ్యా శంకర శాస్త్రి గారు నాకు కరెంటు డిపార్ట్మెంట్ నుండి పెద్ద చిక్కు వచ్చి పడిందండి .మా ఇంటి మీటరు మూడు నెలలుగా పని చేయటం లేదు . మా లైన్ మాన్ , వాడికిష్టం  వచ్చినట్లు రీడింగ్ రాసి బిల్లు పంపుతున్నాడు .ఇదిగో మీటర్ మారుస్తాను అంటాడు , కానీ మార్చడు . వాడికీ నాకు దసరా మామూలు దెగ్గర తగాదా అయ్యింది .  మూడు నెలలుగా నేను నెలకు వేయి రూపాయల కరెంటు బిల్లు కట్టాల్సి వస్తోంది . ఇహ నాజితం వచ్చి ఆరు వేలు " అని చేప్పాను.
" అంటే మీరు ఏమీ కాల్చక పోయినా - లేదో ఎంతో మరింత గా కాల్చినప్పుడు కూడా --  మీరు నెలకు వేయి రూపాయలు కడుతూ వున్నారు  న్నారు ? మీకు లైన్ మెడలు వంచాలని మా ఇదిగా వుంది అవునా ? అని ధీమా శంకరం గారు అడిగాడు.
అవును అన్నాను.
అయన ఆకాశం లోకి ఒక చిటిక వేసి ముక్కు పొడుం సృష్టించి స్వీకరించి ఇట్లా చెప్పాడు " మీరు నేరుగా ఇంటికి వెళ్లి పొడుగులో పెద్దవి -బలంలో గట్టి వి అయిన వైర్లు తీసుకొని వాటిని మీఇంటి ప్లగ్ లో గుచ్చండి . వైరు  చివర ఇంకో ప్లగ్ పెట్టండి . ఈ వైరుని వీధి గోడమీదనుంచి రోడ్డు మీదకు జార వెయ్యండి . ఆపై అందరి

ఇళ్లకు వెళ్లి " నేను ఈ సారి వార్డు మెంబెర్ గా పోటీ చేద్దాము
అనుకుంటున్నాను . అందుకని అందరికీ ఉచిత విద్యుత్
సమర్పిస్తూ వున్నాను అని చెప్పు . నీ పని అవుతుంది "
నేను మాత్రం తక్కువా ? వారణాసి రామ కృష్ణ ను - కృష్ణమ్మ నీరు
తాగిన వాడిని
కనుక అందిస్తే అల్లుకు పోయాను . వైరు అమర్చి దాని చివర
ఒకటి కాదు ఐదు ప్లగ్ లు పెట్టాను .

మా ఇంటి పొంటి భావని ఆమె అమ్మాయి  ఉచిత విద్యుత్
పధకాన్ని నమ్మి ఒక గ్రైండర్ . ఒక వాటర్ హీటర్ . ఒక మిక్సీ
తెచ్చి మా ఉచిత కరెంటును వాడుకున్నది . ఒకరిని చూసి ఒకరు
వచ్చారు .

మూడో నాడు వచ్చిన  ఆడ స్త్రీ లతో పటు ఒక మొగాయన
వున్నాడు . అయన కరెంటు ఆఫీసరుట . ఆడ వారి నోటా నూగు
గింజ దాగదు  కాబట్టి నా పధకం తిన్నగా వెళ్లి అయన చెవిలో
పడ్డది అని తెలుసుకున్నాను .
" ఏమండీ గవర్నమెంట్ వారు ఉచిత విద్యుత్ దానం చేస్తే చేయ
వచ్చు నెమో కానీ మీరు ఉచిత విద్యుత్ దానం చేయ రాదు " అని
అన్నాడు .
"నా ఇంట్లో ని బియ్యం , చద్ది అన్నం , పాత ఊరగాయలు నేను
దానం చేయవచ్చు గానీ నా ఇంట్లో కరెంటును దానం
చేయకూడదా ? ఇదేమి చోద్యం" అని నేను
వాదు లాడాను

"మీ కనెక్షన్ కట్ చేయిస్తాను " అని అయన బెదిరించాడు .
" నేను మీ పై ఆఫీసరుకి టెలిగ్రామ్ కొట్టి ఆయన వచ్చేదాకా
కిందకు దిగను అని పోలెక్కి కూచుంటాను . అప్పుడు మీ
రూల్సు మీద టీవీ లలో పేపర్ల మీద చర్చలు నడుస్తవి -అన్నీ
బైటికి వస్తవి " అని నేను మొండి బెదిరింపు చేశాను .

కరెంటు ఆఫీసర్ గారి వెంట మా లయన్ మాన్ కూడా వచ్చాడు .
కరెంట్ మీటరు సంగతి ఆయనకు ఇంకా తెలీదని మా ఇద్దరికీ
అవగతం అయ్యింది .తెలిస్తే ఈ వాదులాట చేయక పోవు గదా ?
ఆ మరునాడు మా లయన్ తేలు కుట్టిన దొంగలా వచ్చి ఇంకో
మీటర్ బిగించి చేయి చాపాడు . వాడి అలవాటు ఎందుకు పోవాలే
? అని నేను ఓ ఫది రూపాయలు వాడి చేతిలో పెట్టి " ప్రజలు మీ
ఆఫీసర్ కి ఈక్వల్ ర బాబూ " అన్నాను.

మనింట్లో ని కరెంటుని మనిష్టం వచ్చినట్లు దానం చేసుకోకూడదా
? ఏమిటి ?
మీ తీర్పు కోరుతూ వున్నాను .
వారాణసి శ్రీ రామ కృష్ణ స్వంత కల్పిత రచన .

10.ఎంకి దేముడి హత్య- కథ 07-08-24

పాత నాగరికతలు చెందిన విషయాలు  తెలుసుకోవటం అంటే ఆనాటి ప్రజలు చేసిన ఆలోచనలు తెలుసుకోవటం - అనుకుంటూ చదవండి .
ఇది ( 2000 BCE) నాటి సుమేరియన్ నాగరికతకు చెందిన విషయాల  కథ .

సుమేరియన్ { నాగరికతకు చెందిన } ప్రజల ప్రకారం  - సూర్యుడు ఒక కొండ మీదకు ఎక్కి మరో కొండమీదకు దూకుతూ ఉంటాడు . ఆయన దూకుడు కు పట్టిన కాలం  మనకు పగలు . అయన మళ్లా కొండ ఎక్కి మాళ్ళీ దూకడానికి పట్టే కాలము మనకు రాత్రి - .సూర్యుని యొక్క భార్య నమ్ము . వీరికి కవల పిల్లలు పుట్టగా అందులో   మొదటి కొడుకు ఎంకి దేముడు  .

సుమేరియన్లకు  మంచి నీటిని ఇచ్చింది  ఈ ఈ ఎంకి దేముడే . ఈ దేముడు కొండ ఎక్కుతూ {తండ్రి కోసమా ?} ఉండగా అయన భుజము నుండి కారిన {చెమట}నీరు మనుషుల పాలిట మంచి నీరు అయ్యింది . ఎంకి దేముడు మానవులకు - తెలివిని - జ్ఞనాన్ని - చమత్కారాన్ని -మంత్రాలను తంత్రాలను - మోసాలను - గారడీ విద్యలను - గర్భములో కి పిల్లలను ఇచ్చే దేముడు. అలాగా ఈయన మానవులకు అనుకూలం గా పని చేసే దేముడు కూడా .
ఈయనకు ఎనిమిది మంది పిల్లలు -
అబూ  (వృక్షాలను  పెంచుతాడు )
నింతుల్లా  (విలు పైన లోహాలు ఇస్తాడు )

నింసితు  (వైద్యం చేసే దేవత -ఈమె వైద్యానికి దేముడు ఐన "
నినాజు"  ని పెండ్లాడింది .
కోడ్ - గాయాలను మాన్చే దేవత . ఈమె గాయాలను మాన్చే
నినాజు దేముడిని పెండ్లి ఆడింది )
{నేడు మనము అనుకున్నట్లు --  వైద్యురాలు - వైద్యుడిని
పెళ్లాడటం సమంజసం - దానివల్ల  మానవాళికి ప్రయోజనం
ఉంటుందని అని ఆనాటి   ప్రజలు కూడా అనుకున్నారా ?}
నింకేసి  (బీరును తయారు చేసి ఇచ్చిన దేవత )
నంశె  (సామాజిక న్యాయం , సంతానము ,ఇచ్చే దేవత ,
మనుషులకు వచ్చే కలల
కు అర్ధం ఏమిటో చెపుతుంది )
అజిముగా  ( వంటి మీది పుండ్లను మాన్చే దేవత . పాతాళ
లోకపు దేముడు  ఐన నింగిషీదా కు భార్య )
అంశగా  (ఈయన మానవులు ఆరోగ్యంగా పెరగటానికి కావాల్సిన
ప్రకృతిని - వనాలను - పార్కులను అభివృద్ధి చేసే దేముడు )
నీటి  (ఊపిరి తిత్తులను ప్రాణాన్ని పెంపొందించే దేవత {బల మైన
ఊపిరి తిత్తులు ఎక్కువకాలం బ్రతకటానికి అవసరం అని ఆనాటి
వారు ఊహించారా ? ఇలాగ దేవీ దేముళ్ళను ఊహించటం ద్వారా
ఆనాటి సమాజం తాము సుఖ జీవనం చేయటానికి ఏమి అవసర
మని కోరుకున్నారో మనకు తెలిసిందా ?}
ఎంకి దేముడూ అయన పిల్లలు అందరూ కూడా మానవుల సేవ
లోనే వున్నారు .

దేముళ్ళలో పెద్ద దేముళ్ళు - చిన్న దేముళ్ళు కూడా వుంటారుగా . పెద్ద దేముళ్ళు చిన్న దేముళ్ళని పిలిచి నదులు పారటానికి వీలుగా నేలను లోతుగా తవ్వమన్నారు . అట్లా నదులు ఏర్పడ్డాయి . నదులు తవ్వీ తవ్వీ చిన్న దేముళ్ళకు ,ఆయాసము, నీరసము , కోపం వచ్చింది . వారు తమ పనిని మానవుల చేత చేయించమని పెద్ద దేముడిని అడిగారు . అయన సరే అన్నాడు . మానవులు నదులను త్రవ్వుతూనూ - తవ్వి విశ్రాంతి తీసుకుంటూనూ - పిచ్చా పాటి మాటలు - పాటలు పాడారు. ఈ శబ్దానికి దేమునికి తల నొప్పి వచ్చి - ఈ శబ్దాలు చేసే మానవులను చంపి వేయటానికి అని నదులకు వరదలు తెప్పించాడు .{ ఈ కారణంగా నదులకు వరదలు అనేవి వస్తాయి.}ఈ సారి సుమేరియన్ ప్రాంతం లో ఒక పెద్ద వరద వచ్చింది . ఎంకి దేముడు ఆ వరదలో చని పోయిన మనుషులను తిరిగి స్త్రీ గర్భాలలో పెట్టాడు . . అట్లాగా ఈయన పిల్లలని కడుపులో పెట్టె దేముడు అయినాడు . తన కోపం వృథా అయినందుకు పెద్ద దేమునికి ఎంతో కోపం వచ్చింది .

.

.అప్పుడు Nergal అనే మృత్యు దేముడికి Anshar అనే దేముడిని తోడు ఇచ్చి ఎంకి మీదకు పంపాడు . ఈ నెరుగల్ దేముడు పంట పొలాలను ఎండి పోయేట్లు చేసి మృత్యువును సృష్టిస్తాడు . Anshar అనే అయన ఆకాశానికి దేముడు - మృత్యు దేముడు కోరుకున్న విధంగా ఆకాశాన్ని మార్పు చేసి పంటలను మల మల మాడ్చుతాడు . Anshar మరియూ Nergal సుమేరియన్ల దేముళ్లు కారు . వారు బాబిలోనియాకి

చెందిన దేవుళ్ళు . సుమేరియన్ల దేముడు అయితే సుమేరియన్లను చంపాడేమో ? అని ఆలోచించిన పెద్ద దేముడు -- ఇంకొకరి దేముళ్లను సుమేరియన్ల వీరి మీదకు పంపాడు. అప్పుడు ఎంకి దేముడు మానవుల మనుగడ గురించి ఎంతో ఆందోళన పడ్డాడు .
NERGAL అనే మృత్యు దేముడు - ఎంకి దేమునితో "నీకు పచ్చని పంట పొలాలు చూపిస్తాను రా " నమ్మపలికి ఎంకి దేముడిని ఒక కొండ లోయలోకి తీసుకు పోయాడు . ఆ పచ్చని పొలాలు చూసి ఎంకి దేముడు పరవశం తో ఉండగా - Anshar మరియూ Nergal దేముళ్ళు ఎంకి దేముని మీదకు దూకి -మెరుపు అనే ఆయుధాన్ని - ఎంకి దేముని గుండెలలో దింపారు .

ఇంతటితో ఈ కథ ఐ పోయింది .



**GOD ENKI CLIMBING A HILL & WATER FLOWING FROM HIS ARMS**

సుమేరియన్లు " తాము పూజించే దేముళ్ళు ఎప్పుడూ కూడా తమ క్షేమమే కోరుతారుకానీ చంపబు" అని - కానీ పెద్ద దేమునికి గనుక కోపం వచ్చి తమని చంప దలిస్తే - ముందుగా తమ దేముని వేరే వారి దేముళ్ళతో తమ దేముడి ని చంపించి - ఆపై తమను చంపుతాడు అని - నింగిలోని దేమునికి ఎవరూ ఎదురు నిలబడలేరు అని సుమేరియన్లు అనుకున్నారు అని ఈ కథనుండి
గ్రహించ వచ్చు .

ఈ కథను క్లుప్తం గా చెప్పటం కోసం ఎన్నో మిస్ చేసాను .
అందువల్ల ఇది ప్రామాణిక చెరిత్ర ననుసరించి రాసిన కథ కాదు .

రచన సేకరణ వారాణసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

చివరి మాట - పని చేయకుండా -మాట్లాడుతూ పోట్లాడుతూ /
పాటలు పాడుతూ కూచునే మనుషులు / కూలీలు నాగరికతకు
చేటు  అని ఈ కథ లో చేపుతున్నారేమో ?

09. ది పూర్ మ్యాన్ అఫ్  నిప్పూర్ **--** కథ   **06-08-24**
**701**  బీసీ నాటి కథ

The Poor Man of Nippur" అనేది సినిమా గా కూడా తీశారు .
ఈ కథ ను  బాబిలోనియన్ నాగరికులు బాబిలోనియన్ భాషలో క్రీ
పూ . 701  -సంవత్సరాలలో ఒక మట్టి పలక మీద రాసి పెట్టారు
. ఈ కథ వున్న మట్టి పలక నేటి  టర్కీ దేశం లో 1952  లో
దొరికింది .  ఇది  హాస్య ధోరణి గల కథ . కథను-కథలోని పాత్ర
కానీ వాడు చెపుతూ ఉంటాడు . ఇదీ  నేపథ్యం.

జమీల్ నినుర్త అనే పేదవాడు { Gimil-Ninurta }, తన అదృష్టం
పరీక్షించుకోవటం కోసం నిప్పూర్ అనే పట్టణం వచ్చాడు . నినుర్త
అన్న పేరులోనే ఒక విశేషము వున్నది . నినుర్త అంటే
యుద్ధాలకు దేముడు .లేదా ప్రతీకారాలను పెంచి పోషించే

దేముడు. ఈ దేముడు మానవులకు మిత్రుడు కూడా . అందువల్ల ఈ కథను " ది రివెంజ్ అఫ్ నినుర్త ",అని కూడా అంటారు .

నినుర్త - నిప్పూర్ పట్టణంలోకి ప్రవేశిస్తూ నే తన వంటి మీద ఉన్న దుస్తుల్ని లేదా చేతిలో ఉన్న సామాను అమ్మి - మేకమాసం తినాలి అన్న కోర్కెతో ఒక మేకను కొన్నాడు . .అమ్మి మేకను కొన్నాడు. కానీ తీరా చూస్తే ఆ మేకను వండటానికి కావాల్సిన వస్తువులు ఏవీ అతని ఇంటిలో లేవు . ఒక గృహస్థు తాను మాంసము తింటూ దానిని తన పొరిగింటి వారితో పంచుకోక పోవటం దేముడు ఒప్పుకునే సంగతి కాదు . అట్లాగని మేక మాంసం లో ఏమీ మసాలా వేయకుండా అతిథికి వడ్డించటం కూడా దేముడు మెచ్చే సంగతి కాదు . ఇలాంటి పనులు అంటే పొరుగు వాడికి మేక మాంసం పెట్టకపోవడం, పెడితే అందులో మసాలా లేకపోవటం వంటివి- పొరుగింటి అయన తనకు ఎదో ఘోర అవమానము జరిగినట్లు ఫీల్ అయ్యేట్లు చేస్తుంది అనికూడా అనుకున్నాడు .మాంసము అందులోనూ మసాలా లేని మాంసము పెట్టి . పొరుగు ఇంటి వాడిని అవమానించటం మంచిది కాదు కదా ? అనుకున్న నినుర్త ఇట్లా ఆలోచించాడు . " నేను ఈ మేకను ఈ నగర అధిపతి కి కానుకగా ఇస్తాను . ఆచారము ప్రకారము ఆయన తిరిగి నాకు ఎదో ఒక బహుమానము ఇస్తాడు" . ఇట్లా అనుకున్నాక నినుర్త నగర అధిపతి వద్దకు వెళ్ళాడు .
ఇహ మెసపటోరియన్ నాగరికత ప్రకారం మన ఇంటికి వచ్చిన వాడు మన అతిథి . ఇలా వచ్చి ఆలా పోయే వాడు కాదు . తినే

పోతాడు . ఇదికాక వచ్చిన అతిధి వస్తూ వస్తూ ఏదన్న
బహుమానం పట్టుకు వస్తే , ఇంటి యజమాని వారిని ఎంతో
గౌరవం చేయాలి .తప్పదు .
కానీ పై నాగరికతకు విరుద్ధంగా - నగర అధికారి గారు మేకను
తాను తిని - ఒక మేక బొక్క - కొంచము రసము నినుర్ధకు ఇచ్చి
- ఆపై ద్వారపాలకులతో నినుర్త ని వీధిలోకి తోయించాడు .

దీనిపై నినుర్త కి కోపము వచ్చి " నేను మీ సార్ పై ఇంతకు
మూడురెట్ల ప్రతీకారం తీర్చుకుంటాను " అని ద్వారపాలకు ల
ముందు ప్రతిజ్ఞ చేసాడు . ఆపై ఆ ఊరి రాజుగారి వద్దకు వెళ్లి " మీ
రధాన్ని నాకో రోజు ఇవ్వండి . బదులుగా నేను మీకు బంగారు
నాణేలు ఇస్తాను " అని చెప్పి - రాజునుండి ఓ రధాన్ని
పుచ్చుకున్నాడు . తన రధం మీద ఎవడో దగుల్బాలజీ గాడు
ఎక్కి తిరిగితే బాగుండదు అనుకున్న రాజుగారు . నినుర్తకు రాచ
దుస్తులు బహూకరించాడు .ఇలా అవుతుందని నినుర్త
అనుకున్నదే .నినుర్త ఆ రాచ దుస్తులు వేసుకొని -ఆ రాజు గారి
రధము ఎక్కి తిరిగి నగర అధికారిగారి ఇంటికి వచ్చాడు . వచ్చి
" నేను రాజు గారి ఇంటి నుండి బంగారాన్ని కొరియర్ తెచ్చాను"
అని ద్వారా పాలకులకు చెప్పాడు . అయితే నినుర్త ఇంతకు
మునుపే తెలివిగా అలోచించి - రెండు పక్షులను పట్టి ఒక పెట్టెలో
పెట్టి - పెట్టె లోది బంగారము అని పించే విధముగా బరువులు
కూడా పెట్టుకుని వాటినే కొరియర్ గా తెచ్చాడు .
నినుర్త ని చూసి - ఈయన ఎవరో గొప్ప మనిషి అని భావించిన
ద్వారపాలకులు ద్వారాలు తెరిచి అతనికి తమ యజమాని

దర్శనం ఇప్పించారు . నగర అధికారి నిసుర్ధని పోల్చుకోలేక ,
నిసుర్త గొప్ప అధికారి అని భావించి అతనికి గొప్ప విందు
ఇచ్చాడు .ఆ విందు తరువాత ప్రతి ఒక్కరూ నిద్రకు పడ్డారు .
నిసుర్త తన కపట నిద్ర లేచి పక్షులను ఆకాశంలోకి పంపించాడు
.ఆ మరునాడు నగర అధికారి ఆ ఖాళీ పెట్టెను చూసి తన ఇంట్లో
ఎదో రాబరీ జరిగింది అంటూ అందరినీ అప్రమత్తం చేసాడు .
అప్పుడు నిసుర్త "రాజుగారి మనిషి" హోదాలో మాట్లాడుతూ " నీ
ఇంటిలో బంగారము పోయినపుడు దానికి నీదే భాద్యత" అంటూ
నగర అధికారిని దూషించి - ఆపై కర్ర దెబ్బలు కూడా వేసాడు .
చివరికి ఆ అధికారి రొండు మణుగుల బంగారాన్ని నిసుర్తకు
ఇచ్చి సంధి చేసుకున్నాడు . నిసుర్త గేట్ దాటి వెడుతూ ద్వార
పాలకులతో " మీ అయ్యా గారికి ఇంకో రొండు కోటింగులు
పడతాయి చూడు " అని ఛాలెంజ్ చేసి మరీ వెళ్ళాడు .

ఈ సారి నిసుర్త ఒక డాక్టర్ వేషం వేసాడు . బాబిలోనియన్ పద్ధతి
ప్రకారం ఒక వ్యక్తి డాక్టర్ కావటం చాలా తేలిక .తమ తలను
ఎడమపక్కగా సగం గొరిగించుకంటే చాలు . డాక్టర్ అయినట్లే .
నిసుర్త డాక్టర్ లాగా మారి నగర అధికారి ఇంటి కి వెళ్లి "
మిమ్మల్ని పరీక్షించకుండానే మీ ఒంటి మీద ఎక్కడ దెబ్బలు
తగిలినవో చెపుతాను . ఆ గాయాలు ఆ నొప్పులుకోనా తగ్గిస్తాను
" అని నమ్మ పలికాడు . తన వైద్యము బాగా చీకటి వున్నా
గదిలో చేస్తే మాత్రమే ఫలిస్తుంది అని కూడా నమ్మ పలికాడు .
దీనితో అధికారి తనకు తానుగా చీకటి గదిలో కి వచ్చాడు . ఆ
అధికారిని చీకటి కొట్లో పడేసి మరొక సారి చావ తన్నులు

తన్నాడు పైద్యుడి పేషం లో వున్న నిమర్త . తన్నిన తరువాత మహారాజులా బయట కు జారుకున్నాడు .

నిమర్త ఈ సారి ఒక యువకుడిని కూలీకి పెట్టుకున్నాడు. వాడితో " నీవు వెళ్లి " నీకు మేకను మాంసము కింద ఇచ్చింది నేనేరా అని అరువు . లోనికి వినబడేట్లు మరీ అరువు " అని పురమాయించాడు . ఆ కేకలు విని "వాడిని పట్టుకొని తన్నాలి" అనుకున్న ద్వార పాలకులు ద్వారము విడిచి వచ్చారు . వారు అటు పోగానే నిమర్త అధికారి ఇంటిలోకి దూరాడు - ఒంటారిగా చిక్కిన ఆయనను మరొకసారి చితక తన్నాడు . ఈ దెబ్బలకు నగర అధికారి నేల మీదా పాక్కుంటూ బయటికి వచ్చి తప్పించుకున్నాడు.
ఈ రకంగా ప్రతీకారాలకు దేముడు అయిన నిమర్త పేరును తనకు పెట్టుకున్న నిమర్త అనే పేదమనిషి - నగర అధికారిపై మూడు సార్లు తన ప్రతీ కారన్నీ తీర్చుకున్నాడు .
- ఎంతో కాలం క్రిందటే అనగా నేటికీ ౨౭౦౦ ఏండ్ల క్రితమే వున్నా ఈ చందమామ కథ లాంటి కథను మీకు అందించినందుకు - నేను ఎంతో ఆనందిస్తూ వున్నాను .

ఈ కథలో నీటి ఏమీ లేదా అని ? ఆలోచిస్తే - ఓం శాంతి ఓం శాంతి అంటూ శాంతి మంత్రం చదవటం అప్పటి ఆచారం/ పద్ధతి కాదు . ఎవరి మూలకంగా నైనా ఏదన్నా అవమానము పాలై ప్రతీకారము తీర్చుకోవాల్సిన అవసరం వస్తే తీర్చుకోవాల్సిందే. దానికి నిమర్త దేముని సాయం ఉంటుంది . లేకపోతే ఈ కథలోని హీరో కి రాజు

గారు తన  రధము - దుస్తులు అంత సుళువుగ్గా ఇచ్చినట్లు ?
ఇలాంటి అవమానమే ఏదన్నా రాజుగారికి జరిగితే,  అయన
అయితే   యుద్ధము చేస్తాడు . నినుర్త దేముడు ఆయనకు కూడా
సాయం చేసి యుద్ధము గెలిపిస్తాడు.  అందు   వల్ల ప్రతీకార ఇచ్ఛ
తో చేసే యుద్ధాలు మానుకో నక్కరలేదు అని ఆ నాటి నాగరికలు
అనుకున్నారు కావచ్చు . ఈ భావంతోనే అనేక చారిత్రిక యుద్ధాలు
కూడా జరిగాయి .



**Above is** ది పూర్ మ్యాన్ అఫ్  నిప్పూర్ **-** కథ**- 701**  బీసీ నాటి పెంకు పలకలు

సేకరణ రచన వారనాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .

**08. "అడపా"** కథ **5-08-24**

ఈ కథ 14th century బీసీ నాటి మెసపటోనియా నాగరికత లోని పలక పుస్తకాలనుండి లభించిన కథ .

"అడపా" ఓ . రాజుగారు. చాపలు పట్టటానికి అని పడవలో సముద్రము మీదకు వెళ్ళాడు . ఇంతలో సుడిగాలులు వీచి అయన పడవను సముద్రం లోపలి కి లాక్కు పోయాయి . దీనితో అడపా రాజుగారు గాలిపై కోపించి గాలి దేముని యొక్క రెక్కను , కత్తి పెట్టి విరగొట్టాడు . దానితో గాలి ఒక ఏడూ రోజుల పాటు ఎటూ కదల లేక చతికిల పడి పోయింది . గాలి ఎటూ కదలక పోవటం చూసి నింగి లో ని దేముడు, అనూ అనే పేరున్న సూర్యదేమునికి చాలా కోపం వచ్చింది . అప్పుడు అనూ దేముడు అడపాకు ఒక సందేశము పంపి " గాలి దేముని రెక్కను నీవు ఎందుకు నరికావొ ఏమిటో అనే విషయము మీద నీ సంజాయిషీ ఏమిటో నాకు వచ్చి చెప్పు " అనే ఆజ్ఞ వేసాడు .

అడపా సూర్యుడి వద్దకు బయలు దేరాడు . అలా బయలు దేరినపుడు "ఈ " అనే దేముడు{ చంద్రుడు కావచ్చు } వచ్చి - మనుషులు నింగి లోని దేముడు ముందు ఎలా మెలగాలో వివరించి చెప్పాడు . "ఈ " అనే దేముడు సృష్టి జరిపిన దేముడు - అందరికీ తండ్రి వంటి వాడు అవుతాడు . అందువల్ల అడపా "ఈ" యొక్క మాటలని నమ్మి తాను గాలి దేముని రెక్క నరికిన కారణం చెప్పుకున్నాడు . అదివిన్న "ఈ" దేముడు అడపాతో "

దీనికి గానూ సూర్య దేముడు  నీకు మరణ శిక్ష వేస్తాడు  - కానీ నీకు అనేక మర్యాదలు చేసి "నువ్వు మరణం అనేది లేకుండా చిరకాలం బ్రతికి ఉండాలి అంటే ఇవి తిను "   అంటూ ఆయన నీకు కొంత ఆహారము పానీయము ఇస్తాడు . నీవు అయన ఇచ్చిన ఆహారము తినకు పానీయము తాగకు. వాటిలో విషము కలిపి నిన్ను చంపాలన్నది అయన ఎత్తుగడ.    . ఇవి కాక ఆ  అనూ దేముడు ,వంటికి రాసుకో అని ఏదన్న నూనె వంటిది నీకు ఇస్తే అది తీసుకో.  వస్త్రము వంటిది ఇస్తే కట్టుకో " అని కూడా చెప్పాడు .{చివరిలో 01 వద్ద  నా వివరణ ఇచ్చాను }

అడపా తో "ఈ"  దేముడు ఇంకా ఇలా చెప్పాడు . "నువ్వు నింగి లోని దేముడి యొక్క ద్వార పాలకులుగా ఉన్న  తమ్ముజ్ మరియూ  గిషీదా అనే వారిని  చూడగానే , వారిని బాగా  పొగుడు .  తమ్ముజ్ చావులకు { అస్తమయానికి కావచ్చు ?}   మరియూ గిషీదా తిరిగి పుట్టుటకు { సూర్యో దయానికి కావచ్చు }  కారకులు గా వున్నారు *02    "నువ్వు  వారిని బాగా పొగిడి వారు ఎవరో వారి గొప్పతనము ఏమిటో అనేది నీకు ఇంతకు  ముందే నీకు తెలుసును అన్న అభిప్రాయము వారిలో కలిగించు {*03 }  " దానితో వారు నిన్ను   సూర్య దేముని దెగ్గరికి  నేరుగా పోనిస్తారు - అలాగే నీకు ఏదన్న  అవసర పడినపుడు నీకు అనుకూలంగా కూడా మాట్లాడుతారు -  కూడా అని చెప్పాడు .
చివరికి  అడపా  "అనూ "  అని పిలవబడే సూర్య దేముని దెగ్గరకు వెళ్ళాడు . ముందుగా కనపడిన ద్వారపాలకులు పొగిడాడు . "అనూ "  దేముడు అడపాకి  ఆహార పానీయాలుఇచ్చాడు .

అడపా వాటిని  తిరస్కరించి అయన ఇచ్చిన నూనె - వస్త్రములు మటుకూ తీసుకున్నాడు .

దీని పై "అనూ "  దేముడు " మనిషి అనే వాడు  ఆహారాన్నీ పానీయాన్నీ తిరస్కరించటమా ?అది ఎందుకు అయ్యి ఉంటుంది ? అని ఆశ్చర్య పోయాడు .
నిజానికి  "అను" దేముడు ఇచ్చిన  ఆహారము "ప్రాణము " ను, పానీయము " అమరత్వము  ను ఇచ్చేవస్తువులు  .

"అనూ"  దేముడు అడపా తో  " రా వచ్చి నీ సంజాయిషీ ఏమిటో చెప్పుకో " అని పిలిచాడే కానీ - ఆయనికి "  అడపా"  ని చంపే ఆలోచన ఉన్నట్లు ఎక్కడా కన పడ  బడలేదు .  "అనూ " దేముడు అడపా ని " నువ్వెందుకు గాలి దేముని రెక్క నరికావు? " అని అడిగి తెలుసు కున్నాడు .అడపా అనూ దేమునికి కోపం తెప్పించని తెలి పైన సమాధానము ఎదో చెప్పాడు . అప్పుడు అనూ దేముడు  " ఇంత తెలివి గల మనిషివి కదా ? "అమరత్వాన్ని ఇచ్చే ఆహార పానీయాలను ఎందుకు వద్దు అంటున్నావు ?  ఆ " ఈ" దేముడు నీకూ నీ   భూలోకానికి అమరత్వాన్ని అందించకుండా నీకూ నాకూ మధ్య  అడ్డము పడుతున్నాడు అని గ్రహించ లేక పోయావా ? నన్నే అనుమానించావా ? అని ప్రశ్నించాడు .{*04 }
అనూ దేముడు ఇంకా ఇట్లా అన్నాడు  . "  పుట్టటం ఎందుకు? చావటం ఎందుకు?  అని మనుషు లు యుగయుగాలుగా బాధ పడుతూ వున్నారు . ఆ భాదను పోగొట్టాలని , నేను మీకు

మృత్యువుని దరి చేరనివ్వని ఆహార పానీయాలు ఇవ్వ బోయాను . కానీ అలజరుగ లేదు" .        అనూ  దేముడు తన మనసులోని మాటను అడపాకి  వివరించి చెప్పేసాడు  .  అయన దెగ్గర గుట్టు మట్లేమీ లేవు .

అడపా  భూలోకంలోకి తిరిగి వచ్చాడు ."తాను   అమరుడు కావటానికి బదులు చనిపోక తప్పని మానవుని గా " మారి వచ్చాడు    .

పై సంఘటన  తరువాత,  అడపా కి మోసపు మాటలు చెప్పినందుకు గానూ   "ఈ "  దేమునికి - "అనూ "దేముని చేతిలో గానీ - అడపా చేతిలో గానీ ఓ శిక్ష పడవలసి వుంది . కానీ--

ఈ కధ మెసపటోనియా నాగరికతకు చెందిన మట్టి పలకల పై ఉందనుకున్నాము కదా ? , పైన చెప్పినంత వరకు మాత్రమే  కథ చదవటానికి వీలుబడింది . {ఈ సంగతులను నేను  "ది  లైబ్రరీ అఫ్ రాజా  అశుర్బానిపాల్"   685 BC –  627 BC  " గురించి ఒక వ్యాసము 04 . 08 . 24  న పోస్టు చేసాను .} మిగిలిన కథ రాసి ఉన్న మట్టి పలుకలు పగిలి పోయి వున్నాయి పోయి పూర్తి కథ ఏమిటో తెలుసుకోవటానికి  ఎవరికీ వీలు కాలేదు.
కానీ  ఈ కధ ఇలా ముగిసి ఉంటుందని మాత్రం ఊహించారు .

మంచి ఉద్దేశ్యము తోటే "ఈ" దేముడు అడపా కి సలహాలు చెప్పాడు . సలహాలు ఇవ్వటంలో "ఈ" దేముని తప్పేమీ లేదు . కానీ ---- " ఈ" దేముడు , ఆడపా కి - తన నుండి మరణ శిక్ష తప్పించుకునే ఉపాయం చెప్పాడు కాబట్టి - అందుకు ప్రతీకారం తీర్చుకోవాలన్న ఆలోచన " అనూ " దేము ని లో కలిగింది . అందువలన అయన చివరి క్షణంలో ఆహారంలోనుండి విషము తీసి వేసి అందులో అమరత్వాన్ని పెట్టాడు. ఇలా చేసి "ఈ" దేముడిపై జనాలకు ఉన్న నమ్మకం పోగొట్టాలని , ప్రజలలో అతని పట్ల ఆదరణ లేకుండా చేయాలని "అనూ " దేముని ప్లాను . {అనగా చిల్లర దేముళ్ళను నమ్మవద్దు అని పెద్ద దేవుడు ప్రజలతో చెప్ప దలుచుకున్నాడు అనుకోండి }

చివరికి చూస్తే దేముళ్ళ మధ్య పడి నలిగిన మనిషి . "అమరుడికి " బదులు "మృతుడు " కావల్సి వచ్చింది అని ఈ కథ తెలుపుతుంది .. "ఈ " దేముని కారణంగా మనుషులందరూ కూడా mortals అయినారు . "అనూ" దేముడు అడపా ని చంపుతాడు అని "ఈ" దేముడే ఊహించాడు - కానీ అలా అని ఆయనకు ఎవరూ చెప్పలేదు .{ ఊహల ఆధారంగా ఎప్పుడూ ఏ ఆలోచనలు చేయవద్దు అని ఈ పురాతన కధలోని నీతి.అనుకోవచ్చు ఈ నీతి నేటికీ వర్తిస్తుంది ?}

ఇంకో వూహ ప్రకారం - అడపా చివరికి ఎలాగో "ఈ " దేముడు తనకు తప్పుడు సలహాలు చెప్పి మానవులకు అమరత్వము

అనేది అందకుండా అడ్డము పడ్డాడు అని గ్రహించాడు . ఆపై
అడపా "ఈ" అనే దేముడిని శిక్షించాడు .

ఇది చూసిన అనూ దేముడు "అమరత్వము లేని మనిషి చిన్న దేముళ్ళను శిక్షిస్తూ వున్నాడు .ఇదే అమరత్వము ఉన్న మనిషి అయితే నామీదకి కూడా దండెత్తి వస్తాడు కాబోలు ? . "ఈ " దేముడు మానవులకు తప్పుడు సలహాలు ఇచ్చి వారిని నమ్మించి , వారికి అమరత్వము లేకుండా చేసి , మంచి పనే చేశాడు అనుకున్నాడు {అంటే దేముళ్ళందరూ ఒక్కటైనారు అన్నట్లు } . {హిందూ పురాణాలలో కూడా రాక్షషులు - ముఖ్యంగా భస్మాసురుడు అమరత్వము సాధించి , ఆపై పెద్ద దేముడి పైకి వెడతాడు కదా ? ఇలాంటి ప్రమాదాన్ని "ఈ " దేముడు ఊహించి తనను రక్షించాడు అని అనూ దేముడు అనుకున్నాడు }

ఈ కథ బేలోనియన్లకు చెందిన ది. 14th century BCE లోని . కాస్సితే {Kassite } అనే మతము / తెగ వారి కథ . అడపా అనే అయన నిజంగా ఓ రాజు కాదు చేపలు పట్టే వాడు. కానీ కాస్సితే తెగ కు మత విషయాలు బోధించిన బోధకుడు.

కాస్సితే తెగ ప్రజలు తమ మత బోధకుడు అయిన అడపా తమకోసము అమరత్వాన్ని సాధించి తీసుకురావటానికి అని , పెద్ద దేముడి దెగ్గరకు వెళ్లాడని -కానీ మధ్యలో "ఈ " అనే దేముడు జోక్యం చేసుకొని తమకు అమరత్వం అనేది దక్కకుండా

చేసాడని -  అందుకే మానవులకు  చావు తప్పటం లేదు అనే వూహ కొద్దీ  ఈ కథను కల్పించి రాసుకున్నారు అనుకోవచ్చు .{*05 )

------------ నా వివరణలు ---------

*01  - అర్ధ సత్యము . మొదటి విషయము  నిజము అని నమ్మించటానికి రెండో విషయము ఎదో   చెబుతారు .నిజానికి రెండో విషయానికి ఏమీ ప్రయోజనము  ఉండదు.  ఈ తెలివి ఆ నాడే వున్నది .

*02  .సూర్యుడు బయటికి రావటానికి ఒకరు గేటు తీస్తారు - అలాగే సూర్యుడు లోపలి కి వెళ్ళగానే ఒకరు గేటు మూస్తారు అని ఆ కాలంలో అనుకొన్నారు కావచ్చు.

*03 ఎవరన్నా గొప్ప అధికారి  దెగ్గరకు వెళ్ళినపుడు ముందుగా అయన ప్యూన్ ని మంచి చేసు కోవాలని ఈనాడు మనవారు మనకు భోదించే తెలివి .  ఆనాడు కూడా వుంది .

*04 - ఇద్దరు వ్యక్తులు మాట్లాడినపుడు వారిలో అధికారాం లో పెద్ద ఎవరో వారి మాటలే నిజం గా భావించ బడతాయి

*05- మనము బాత్రూం లో జారి పడితే దానికి కారణం మన పని మనిషే గానీ మన అజాగ్రత్త కాదు   అనుకోవటం లో ఎదో శాంతి వుంది . ఇలాగే మానవుల చావుకి కూడా ఎదో ఓ కారణం వుంది - మధ్యలో మనమేమి చేస్తాము ? అనుకోవటం లో గూడా ఓ శాంతి ఉందేమో  నాకు తెలీదు  . ఈకథను అలంటి  ఎదో ఒక ఓదార్పు కోసమే సృష్టించారు అని నేను నమ్ముతాను .

రచన సేకరణ వివరణ వారాణసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

**ABOVE IS -** అడపా"  కథ రాసి వున్నా మట్టి పలక

**07.** రాజు గారి లైబ్రరీ   **4-08-24**
లేదా
ది  లైబ్రరీ  అఫ్ రాజా  అశుర్బానిపాల్

అశుర్బానిపాల్ అనే రాజుగారు   685 BC –  627 BC  మధ్య అసిరియన్ సామ్రాజ్యానికి రాజు . అసిరియా అనేది మెసపటోనియా నాగరికతకు చెంది-   21st  BC నుండి  14th BC, వరకూ మనుగడలో ఉన్న పురాతన రాజ్యము.  ఈ రాజ్యము - నేటి ఇరాక్, ఇరాన్, టర్కీ సిరియా కువైట్ ప్రాంతాలలో ఉండేది . ఆ రోజులలో పుస్తకాలు లేవు . విషయాన్ని పచ్చి మట్టి పలక పై రాసి ఆపై వాటిని కాల్చి వాటికి { ఇటుకల లాగా }శాశ్వత రూపము ఇచ్చే వారు . ఆవే ఆ నాటి పుస్తకాలు .ఇలాంటి పుస్తకాలను అనేకం సేకరించి,వాటిని ఒక లైబ్రరీ లో లాగా పేర్చి పెట్టాడు  ఈ రాజుగారు . అందువల్ల ఈ లైబ్రరీ ని పురావస్తు శాఖ వారు  "ది   లైబ్రరీ  అఫ్  అశుర్బానిపాల్ " అని పిలుస్తారు.  నేను రాజుగారి లైబ్రరీ అని , పిలుస్తాను  .

రాజుగారు పుస్తక ప్రియుడు-  క్రూరుడు . ఇతర రాజ్యాల వారి పలక పుస్తకాలను చేజిక్కించు కోవాలనే కోర్కెతో ,   వారి పై యుద్ధాలకు వెడుతూ వుండే వాడు . ఈయన  ఆధ్యాత్మిక , మతము , వైద్యము , గణితము , మందుల పట్టీలు -  పాటలు - మంత్రాలు- సూక్తులు- ఖగోళ  శాస్త్ర   విషయాలు, సాహిత్య

విషయాలకు చెందిన 30000 పైగా పలక పుస్తకాలు సేకరించాడు . రాజు గారు తాను సేకరించిన ఈ మట్టి పలక లన్నింటిని , మనము మన ఇంటిలో పుస్తకాలని సర్దుకొని పెట్టు కున్నట్లుగా - తన మందిరములో సర్దించి పెట్టుకున్నాడు .
ఇవి నేటి ప్రపంచానికి దొరికే సరికి వీటిలో చాలా వరకూ పగిలి పోయి వున్నాయి . ఇవి రాజు గారి సేకరణలు కాబట్టి, కొన్ని పుస్తకాలు ఎవరినో బెదిరించి పట్టుకొని వచ్చినవి కూడా వున్నాయి .కానీ ఈయన ఎంతో పెద్ద మనస్సు చేసుకుని ఆలాంటి పుస్తకాలపై వాటి - అసలు యజమాని పేరు ఏమిటో అనేది కూడా రాయించి పెట్టాడు - అనగా గ్రంథ సేకర్తలకు తగిన గౌరవము ఇచ్చేడు అని . ఆనాటి వారు చిత్రం / పెయింటింగ్ లాటి వాటిని కూడా పలకల మీద నే చిత్రించారు .వీటిని పక్క పక్కన పెట్టి, అందులోని బొమ్మ ఏమిటో చూసుకో వాలి . ఏ పలక ప్రక్క ఏ పలక పెట్టాలి అనేది తెలిపే టందుకు అని ఈ రాజుగారు ఆ పలకలపై సీరియల్ నెంబర్లను కూడా రాయించాడు . ఇది ఆనాటికి ఎంతో గొప్ప తెలివి .ఈ కారణాల వల్ల - ఈ రాజు గారు ఈనాటి మన లైబ్రరీ లాంటిది ఆరోజుల్లోనే పెట్టాడు అనే అభిప్రాయం కలిగింది .
ఈ పుస్తకాలన్నీ బాబిలోనియన్లు వాడిన భాషలో నూ , అసిరియన్ వాడిన అసిరియన్ భాషలో వున్నాయి .ఈ భాషలు హిబ్రూ భాషని పోలి వుండటాన ఈ పుస్తకాలను కొద్దిగా నైనా చదవగలిగారు .
నియో-అస్సిరియన్ సామ్రాజ్యాన్ని పతనము చేసిన బాబిలోనియన్లు, మేడియన్లు, మరియు పర్షియన్లు కలగలిసిన

సేనలు 612 BCEలో రాజుగారి రాజ మహల్ని కాల్చి వేశారు . దానిలో భాగంగా రాజు గారి లైబ్రరీ శిధిలాల లోకి చేరింది .

నేటి ఇరాక్ లో ని Mosul అనే పట్టణము వద్ద { మోసుల్ పట్టణము ఒకప్పుడు నీనెవెహ్ అనే పేరు మీద ఒకప్పటి అసిరియా కు రాజధానిగా ఉండేది } 1849 లో Austen Henry Layard; అనే బ్రిటిష్ అయన పురా వస్తు త్రవ్వకాలు చేపట్టగా , ఈ లైబ్రరీ అయన కంట పడింది . అయన ఎదో పని మీద బ్రిటన్ పోయినపుడు -అయన శిష్యుడు అయిన , Hormuzd Rassam, అనే అయన అదే చోట వేరొక లైబ్రరీ ని కనుగొని , అక్కడ దొరికిన పలక పుస్తకాలను తెచ్చి - గురువు గారి పలక పుస్తకాలపై కుప్ప పోసాడు . ఏవి తనసేకరణ , ఏవి గురువు గారివి సేకరణ అనేది గుర్తు పెట్టటం మాత్రం మరిచి పోయాడు . దానితో ఈ పలకలు అన్నీ కలగలిసి పోయి బ్రిటిష్ మ్యూజియం చేరాయి . అందువల్ల చాల పుస్తకాలలోని అసలు విషయాలు ఏమిటో అర్ధం చేసుకోవటం కష్టం గా మారింది .{మీరు ఎదో ప్రేమ కధ చదువుతూ ఉండగా వున్నట్లుండి ఎదో చిన్న పిల్లల కధ కల పేజీలు వచ్చినట్లు అయ్యిందన్న మాట }
ఈ పలకలలో మంచిగా వున్నవి - బ్రిటిష్ మ్యూజియం లో " జ్ఞానము - మరియూ అసిరియన్ ఆలోచనలు " అనే విభాగము కల్పించి అందులో భద్ర పరిచారు . ఈ పలకలతో బాబిలోనియా కి వచ్చిన వరదలు , బాబిలోనియా ఎలా ఏర్పడింది అని తెలిపే వివరాలు వున్నాయి .

Ashurbanipal రాజు గారు - తన రాజ్యము నుండే కాక-
బాబిలోనియా ప్రాంతము నుండి కూడా నుండి కూడా పలక
పుస్తకాలు సేకరించాడు . అందువల్ల బాబిలోని యాన్
నాగరికతకు చెందిన కొన్ని విషయాలు ఈయన బుక్కు కల్లెక్షన్
నుండి తెలుస్తూ ఉంటుంది .ఈ రాజు గారు అనేక పుస్తకాలను
సేకరించటానికి కారణం "తెలుసు కుందాము " అనే తపనే కాక -"
తానూ తన రాజ్యము కలకాలం వర్ధిల్లేటందుకు ఏదన్న చిట్కా
మంత్రాలు ఏదన్న పుస్తకం లో దొరుకుతాయేమో అని ఆశ పడటం
కూడా ఓ కారణం .
బ్రిటిష్ మ్యూజియం పై పుస్తకాలను సంరక్షిస్తూ వాటిని డిజిటల్
కాపీలుగా మారుస్తూ వున్నది .
ఈ పుస్తకాల నుండి అనే రెండు కధలు మనకు లభిస్తూ
వున్నాయి . అవి కూడా / రాస్తాను ,
సేకరణ వివరణ వారాణసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .
—-----------------------------------------

**06.** చిత్త చాపల్య యాత్ర **3-08-24**

మా వూరు అమరావతి . ఊరి కి మొదటిలో అనేకం చింత చెట్లు
వున్నాయి . ఈ చెట్లు సర్కారు వారివి . వారు వేలం పాట పెట్టగా
ఎవరో కాంట్రాక్టర్ చింత కాయనన్నింటినీ కొనుక్కున్నాడు .
అందువల్ల ఈ చెట్టు మీద నుండి కాయలు తెంపటము ఓ దొంగ
తనము . దొంగతనమే అయినా కానీ ఎవరికీ తెలియా కుండా
జాగర్తగా చేయవచ్చు గా అప్పుడు ఏమీ అవదు ? ఈ చెట్ల

గురించి ఇంకా ఏమిటంటే - ఈ  చెట్ల మీద దయ్యాలు  బంగరాల్లాగా గిర్రునతిరుగు తూ ఉంటాయని ఒక చద్ది పుకారు .
" దయ్యాలు గియ్యాలు ఏమీ లేవు , నువ్వు చెట్లు ఎక్కి కింద పడి కాళ్ళు చేతులు విరుచుకొని బడి కి ఎగనామం వేయకుండా ఉంచేందుకు - నీ సొంత క్షేమం కోరి ప్రజలు సృష్టించిన పుకారు - రేపు నాతో రా . చింత చెట్లెక్కేది
నేర్పించుతాను " అని మా సంపాయి ఒకడు నాకు చెట్లు ఎక్కేది నేర్పాడు .
లాగు లోపల గోచీ బిగించి కట్టి చెట్టు ఎక్కాలి అని ప్రధమ నియమం .

ఆ నియమాన్ని అనుసరిస్తూ నేను ఓనాడు ఓ చింత చెట్టు ఎక్కాను . పిల్ల చింతకాయలను వామన చింత కాయలు అంటారు .మా మేనత్త లలితమ్మ గారికి
వామన చింతకాయల పచ్చడిని దివ్య చేకోరంగా చేయటం వచ్చు . ఆ పచ్చడి తిని దాని వ్యామోహంలో పడిన వాళ్ళల్లో నేను నెంబర్ వన్ కావచ్చు . ఆమె పచ్చడి చేయటానికి కావాల్సిన ముడి సరుకు ఐన చింతకాయల కోసం నేను చింత చెట్టు ఎక్కాను . మా మేనత్తకి ఓ పిల్ల వున్నది . దాని కోసం అని చెట్టు ఎక్కానని గిట్టని వాళ్ళు అంటారు ఏమో ,  అది నిజం కాదు .
నేను చెట్టు ఎక్కీ ఎక్కీ చిటారు కొమ్మకు ఇంకా నాలుగు కొమ్మలకు ఈవలాగా వున్నపుడు , చిటారు కొమ్మ మీద ఎవరో ఒకాయన , ధోవతినే గోచీ లాగ  బిగించి కట్టుకొని ఉన్నాయన నాకు కనపడ్డాడు . భుజం మీది ఉత్తరీయాన్ని  నోటి తో బిగించి

పట్టు కొని నాకు అయన ముఖం చాటు చేస్తూ వున్నాడు . నేను భయపడుతూనూ భయపడ కుండానూ ఆ కొమ్మలమీదే తచ్చాడుతూ రొండు గంటలు గడిపి ,రొండు కేజీల కాయలు కొసాను .
అప్పుడు పైనున్న ఆయన " ఒరే రామ క్రిష్ణా కిందకు దిగరా . నేను ప్యాసు పోసుకోవాలి " అని నన్ను రిక్వెస్ట్ చేసాడు . అయన వాయిస్ ని పట్టి, అయన - మా తెలుగు మేష్టారు అని తెలుసు కున్నాను . ఆయనను మేము పల్లకీ మాస్టారు అనే మారు పేరుతో పిలుస్తాము .
మా మాస్టారు గారికి కొత్తగా పెళ్లి ఐన రోజుల్లో - తన భార్యను పుట్టింటికి పంపేటప్పుడు ఆమెను పల్లకీలో కూచో పెట్టి - ఆ పల్లకీ వెంట తన సైకిల్ నడిపించుకుంటూ వెళ్ళాడుట . " అయన భార్య ఒక అందాల రాజకన్య అనే చిత్త చాపల్యంతో అయన ఆలా చేస్తూ ఉండవచ్చు " అని మావూరి వారు తీర్మానించారు. అప్పటి నుండీ అయన మాకు పల్లకీ మాష్టారు అయినాడు .
మా మాస్టర్ గారు కిందకి దిగినాక మేము ఇద్దరమూ తోడు దొంగలము అయినాము . ఒకరి సంగతి మరొకరికి చెప్పరాదు అనే ప్రమాణ ముతో మేము స్నేహితులం కూడా అయినాము .

మాస్టారు గారికి చిత్త చాపల్యాలు చాల వున్నవి అని తేలింది .అయన ఒకనాడు ఒంటెద్దు బండి మీద శ్రీశైలం వెళ్లి దర్శనం చేసుకొని వచ్చాడు . మరొక సారి
గుర్రపు జట్కా ఎక్కి హైద్రాబాదు వెళ్ళొచ్చాడు . అయన జమిందారీ ఫాయిదా ఫీల్ అవుతున్నాడని, అయనకు "బాల్య చిత్త

చాపల్యాలు" పోలేదు అని  తోటి టీచర్లు అన్నారు . అప్పటినుండీ అయన పేరు చాపల్యం మాస్టారు అయ్యింది .

ఎంతకాలం గడిచిందో చెప్పలేను . నేను ఒక నాడు మా చాపల్యం మాస్టారు గారింటికి వెళ్ళగానే అయన నా చేతిలో ఒక చీటీ పెట్టి " ఇవి చాలు నంటావా ?" అని గంభీరంగా ప్రశ్నించాడు .ఆ చీటీలో నాలుగు బస్తాల బొగ్గులు ఆరు కాఫీ పొడి , ఐదు పంచదార కేజీలు , కుంపటి , దుప్పట్లు - ఒక రైన్ కోటు , ఒక గొడుగు అని రాసి వుంది ." కొంచెము కిరసనాలు , కొంచెము కొబ్బరి పీచు { కుంపటి రాజ పెట్టటానికి } అనేవి నేను లిస్టుకు జత కలిపాను .
"ఎవరు ఎమన్నా అనుకోనీ . మా ముత్తాత మాదిరి ఎడ్ల బండిలో కాశీ వెళ్లి రావాలని అనుకుంటున్నాను . అందుకోసమే ఈ సామాను " అని అయన అన్నాడు .
"చిత్త చాపల్యం తీర్చుకోవటం లో తప్పేమీ కనపడదు . తమ కూతురిని పెళ్లి కూతురుని చేసి ,  పల్లకీలో నో, గుర్రాల లాగే రధం వంటి బండి మీదనో పెళ్లి మండపానికి చేర్చే తల్లి తండ్రులు వున్నారు . అనగా వారు వారి చిత్త చాంచల్యం తీర్చు కుంటున్నారు . అలాగే మీరుకూడా  మీ చిత్త చాంచల్యం తీర్చు కుంటున్నారు . ఇందులో ఎవరో ఏమో అనుకుంటారు అన్న భయం మీకెందుకు ? అని నేను ఆయనకు వత్తాసు పలికాను .
మా ఊరి ఇసుక రేవు నుండి , తన ఎడ్ల బండితో ఇసుక తేలో వెంకయ్యను పిలిపించాము . ఇంతకు ముందు మా మాస్టారిని శ్రీశైలం తీసుకు పోయింది కూడా వీడే .
వాడితో "కాశీ కి పోయి రావాలె " అన్నాము .

" అలాగే పెడదామండీ .. కిరాయి కి అని , నా భోజనానికి అని , ఎద్దు దాణాకి  అని చాల అవుతుందే ? " అన్నాడు . మళ్ళీ వాడే " మొత్తం ఎంత అనేది ఇంట్లో అడిగి చెపుతాలెండి " అని చెప్పి వెళ్లి పోయాడు .

ఆ మరు నాడు వాడు వచ్చి " కాశీకి వెళ్లినవాడు కాటి కి వెళ్ళినట్లే అని మా ఆడది అంటున్నది . అందుకని వెళ్లే ముందు తనకో ఐదు లక్షలు హామీ గా ఇచ్చి పొమ్మంటున్నది . అదీ ప్లస్ నా ఫీజు ఐదు లక్షలు మొత్తం ఫది లక్షలు ఇచ్చారంటే రేపే మన ప్రయాణం అన్నాడు .

"నా ఖర్చు ఏమీ లేకుండా వుండేటట్లైతే - నేను కూడా ఎడ్ల బండిలో కాశీకి వస్తాను" అని నేను కూడా సిద్ద  పడ్డాను  . మా ముత్తాత కి తాత  కూడా ఎడ్ల బండిలో కాశీకి - అటునుండి అటు రామేశ్వరానికి వెళ్లి వచ్చాడని మా తాత చెపుతూ ఉండగా విని - నేను కూడా అలాగే కాశీ రామేశ్వరాలూ వెళ్లి వచ్చి - ఆ యాత్ర చెరిత్ర రాయాలనే చిత్త చాపల్యం  నాకు కూడా ఏర్పడి వున్నది  . అది ఇప్పుడు తీర్చుకుంటున్నాను అనుకోండి .
ఆ మరు నాడు మేము మా అమరేశ్వరునికి మొక్కి అర్చించి, ఎడ్ల బండిని బైల దేర దీశాము .మమ్మల్ని చూడటానికి మాకు వీడ్కోలు పలక టానికి వచ్చిన ఊరి జనం మాకు జేజేలు పలికి - నగదు కానుకలు కూడా ఇచ్చారు . ఆ డబ్బు చూసి యాత్రకు శుభారంభము అయింది అని మేము అనుకున్నాము .

ఈ మా చిత్త చాపల్య యాత్ర గిన్నీసు బుకు లో కి ఎక్కవచ్చు గావచ్చు . మేము బయలు దేరాము . వెనక్కి తిరిగి వచ్చినాక " మా యాత్ర అనుభవాలు " వివరిస్తాను

ఇట్లు వారణాసి శ్రీ రామ క్రిష్ణా అఫ్ అమరావతి .

05. **22** ప్రతిజ్ఞలు **25-07-24**
బౌద్ధ మతము పుచ్చుకున్న వారు, అభి దమ్మ పిటకము ను అనుసరించి తమ లక్ష్యం సాధించటానికి చేయవలిసిన - 22 ప్రతిజ్ఞలు వున్నాయి ,
ఇందులో మొదటి 06 . -- చూచుట,వినుట - వాసన చూచుట , తాకి చూడుట , ఆలోచించుట - అనే వాటిని అదుపులో ఉంచుకుంటాను అని చేసే ప్రతిజ్ఞలు.
ఇంకో 03 . ప్రతిజ్ఞలు స్త్రీపురుష వివక్షకు చెందినవి- స్త్రీలను గౌరవంతో చూస్తాను అని, స్త్రీని పురుషుడితో సమానంగా చూస్తాను అని . గుడులు లేదా మందిరాలలో స్త్రీని తన కన్నా ముందు పోనిస్తాను అని చేసే ప్రతిజ్ఞలు .
మరొక 05 . ప్రతిజ్ఞలు ఫీలింగ్ లకు చెందినవి . చంపుట , దొంగిలించుట , వ్యభిచ రించుట , అబద్ధము ఆడుట , మద్యం త్రాగుట , మాని వేస్తాను అని చేసే ప్రతిజ్ఞలు .
ఇంకో 05 . ప్రతిజ్ఞలు ఆధ్యాత్మిక విషయాలకు చెందినవి .అవి నమ్మకము లేదా విశ్వాసము కలిగి వుంటాను , శక్తీ తో వుంటాను ,తెలివిగా వుంటాను ,శ్రద్ధ తో వుంటాను . జ్ఞ్యానము పెంపొందించు కొంటాను అంటూ చేసే ప్రతిజ్ఞలు .

ఇంకో 03 . ప్రాపంచిక విషయాలకు చెందినవి.మోక్ష సాధనకు కృషి చేస్తాను అని ,మోక్ష సాధన కోసము  సరి ఐన దారిలో{ నోబుల్ పాత్ } ప్రయాణిస్తాను అని   {, అన్నింటిని మంచి ద్రుష్టి తో చూస్తాను , సమస్యను చక్కగా పరిష్క రించు కుంటాను , మంచి మాటలే మాట్లాడుతాను ,మంచి పనులే చేస్తాను , మంచి పైన ప్రయత్నాలు మాత్రమే చేస్తాను , మంచి దారిలో మాత్రమే ఆహారము సంపాదించుకుంటాను , మంచి మనస్సు కలిగి వుంటాను - మంచి విషయాల మీద మాత్రమే శ్రద్ధ పెడతాను - అనే సంకల్పాలు వి నోబెల్ పాత్స్ అన బడతాయి  } మోక్ష సాధనలో వచ్చే అనుభవాలను ఆనందముతో స్వీకరిస్తాను .అంటూ చేసే ప్రతిజ్ఞలు

ఇప్పుడు 06 + 03+05 +05+ 03 = 22- ప్రతిజ్ఞలు అయినాయి .  అంబెడ్కర్ గారు బుద్ధిజం తీసుకున్నపుడు తన వెంట వున్న 40000  మంది అనుమాయిలచే ఈ క్రింది 22  ప్రతిజ్ఞలు చేయించారు . వీటిని ఒక శిలా ఫలకం మీద చెక్కి దీక్షా  భూమిలో ఉంచారు . ఆ ఫోటో కూడా ఇచ్చాను కాబట్టి ఇక వివాదము లేదు ,

01 . బ్రహ్మ విష్ణు మహేశ్వరుల పై విశ్వాసము లేదు -  వారిని పూజించను .

02  . రామ , కృష్ణ అవతారలపై నమ్మకము లేదు - వారిని పూజించను

03. గౌరీ , గణపతి వంటి హిందూ దేవీ దేవతల పై విశ్వాసము లేదు - వారిని పూజించను

04 . దేముని యొక్క అవతార పురుషుడుగా చెప్పబడే వారి పట్ల నాకు విశ్వాసం లేదు .
05 .బుద్ధుడు విష్ణువు యొక్క అవతారము కాదు . అది తప్పుడు ప్రచారమని నమ్ముతాను .
06 .శ్రద్ధాలు పెట్టము - పిండ ప్రదానము చేయము.
07 .ఏ రూపములో నైనా సరే - బుద్ధుని బోధనలను సిద్ధాంతాలను తోసి పుచ్చము .
08 . బ్రాహ్మలు చేసే ఉత్సవాలను అంగీకరించము/ ప్రోత్సహించము .
09 . మానవులు అందరూ ఒక్కటే అని నమ్ముతాము .
10 .అందరి మధ్యా సమానత్వము స్థాపించటానికి కృషి చేస్తాను .
11.నేను బుద్ధు డు చూపిన అష్టాంగ మార్గాన్ని అనుసరిస్తాను
12 .బుద్ధుడు చెప్పిన పారమిత ను అనుసరిస్తాను { నీతి తో వుండటము , దాన గుణము కలిగి వుండటము , ఓర్పు కలిగి వుండటము , జ్ఞ్యానం పొందటంలో - అత్యున్నత స్థితి ని సాధించమని చెప్పేదే పారమిత }
13 .బుద్ధుడు చెప్పిన ఫది పార మితులను అనుసరిస్తాను . { అంబెడ్కర్ కు బౌద్ధ దీక్ష నిచ్చింది థేరవాదు బుద్దిస్టులు . వీరి ప్రకారం (1) దాన), (2) మంచి నడవడిక అనగా శీల ము (3) త్యజించుట , (4) అంతర్దృష్టి (5) శక్తీ , (6) ఓర్పు (7) నిజాయితీ (8) నిర్ణయాత్మకంగా వ్యవహరించుట ,
(9)ప్రేమ మరియూ దయ కలిగి ఉండుట - దీనిని పాళీ భాషలో (metta), మెట్ట అంటారు - దీనిని బట్టి చూస్తే మెట్ట వేదాంతము అంటే- ఒక వ్యక్తి తనకు జాలీ దయ వున్నట్లుగా , కష్టాలలో

వున్న ఎదుటి  వారుచెప్పే కబుర్లు  మెట్ట వేదాంతము అవుతాయి
(10) సమానత్వము
14 .సర్వ ప్రాణుల పట్ల జాలీ దయ కలిగి వుంటాను
15 . దొంగిలించను
16 . అబద్ధము ఆడను
17 . నేరాలు అనతగ్గ   పాపాలు చేయను
18 . మత్తు పదార్ధాలు సేవించను
19 .బుద్ధుని అష్టాంగ మరగాలను నిత్యజీవితం లో కి తెచ్చుకుంటాను .
20 . మనుషుల పట్ల అనవసరమైన తేడాను చూపించేది ,మానవుల పురోగతిని అడ్డుకునే   హిందూ మతాన్ని త్యజిస్తాను .నా ప్రాంతములో బుద్ధిజం ని ప్రెవేశ పెడతాను .
21 .బుద్ధుడు - అతని ధర్మమే నిజమైన మతము అని నమ్ముతాను . బుద్ధిజం స్వీకరించటం ద్వారా నేను తిరిగి జన్మించినట్లు గట్టిగ నమ్ముతాను
22 . ఇకమీదట నేను బౌద్ధ ధర్మాల ప్రకారము జీవిస్తాను .

- నా వివరణ -విషయాలు ఏమిటో ? అని తెలుసుకో గోరి న వారి కోసం రాసాను .
మక్కీ కి మక్కీ   కొట్టకుండా ఇంగ్లీష్ నుండి తెలుగులోకి రాసాను . మీ అభిప్రాయం వేరుగా వున్నపుడు వికీపీడియా లో  ఇంగ్లీష్ లో వున్న 22 ప్రతిజ్ఞలు చదువుకోవచ్చు

సేకరణ వివరణ రచన వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

4 హమ్మా లావా సద్ధ తిస్స 23-07-24

హమ్మా {అనగా పచ్చిక బయళ్లలో ని చిన్న ఇంటిలో నివసించే వాడు } లావా {అనగా కంటికి గోచరము అయ్యే విషయాల మీద వివరించి చెప్పే వాడు } సద్ధా {బుద్ధుని అనుసరించేవాడు } తిస్స { రాబోయే కాలంలో బుద్ధునిగా జన్మించ దిగిన వాడు } Maha Thera {బౌద్ధ సన్యాసిగా ఉన్నత స్థితికి చేరిన వాడు } అని

భారత రాజ్యాంగ నిర్మాత డాక్టర్ అంబేత్కర్ గారు 14 October 1956, న "దీక్షా " భూమి -- నాగపూర్ లో ,లో బౌద్ధ దీక్ష తీసుకున్న సమయంలో --
౦1.భదంతి చంద్రమణి మహాథేరో {Bhadant Chandramani మాహాథేరో},
02 భంతే ప్రగ్య తిస్స { Bhante Pragya Tiss,} 03 .మహా సంఘ రతన్ మహాథేరా {M Sangh Ratan Mahathera,} 04 భిక్షి ధర్మ రక్షిత్ { Bhikshi Dhamm Rakshit,}
05 . హమ్మా లావా సద్ధ తిస్స {H Saddha Tiss }, 06 .హమ్మా లావా తమ్మానంద్ మహా ధేర { H Thamma Nand Mahathera } 07 . భిక్షు గల్గెదర్ ప్రగ్యానంద్ {Bhikshu Galgedar Pragyanand }.అనే ఏడుగురు బౌద్ధ సన్యాసులు వివిధ హోదాలలో వున్నవారు హాజరు అయ్యారు . ఇందులో 05 నెంబర్ లో వున్న సద్ధా తిస్స గురించి .

సద్ధా తిస్స1914–1990 వరకూ జీవించి ఉన్న బౌద్ధ సన్యాసి . శ్రీ లంక వాడు .తన బౌద్ధ సన్యాస  స్వీకరణ తరువాత ,శ్రీలంకలో ఉన్నత చదువులు కొనసాగించి ఆపై  వారణాసి -లండన్ -ఎడిన్బర్గ్ లో చదువుకున్నారు .ఈయనకు హిందీ ఉరుదు  పంజాబీ భాషలు వచ్చి వుండటాన , భారతదేశములో బౌద్ధ మతము ను ప్రచారము  చేయమని చెప్పి ఈయనను ఇండియా పంపారు. అప్పుడు అంబెడ్కర్ గారికి ఈయన పరిచయము అయ్యింది .{ఇండియా లో పుట్టిన బౌధము ఇండియాలో నే క్షీణించి పోగా  -శ్రీలంక వారు దానిని ఇండియా లో పునరుద్ధారించ  టానికి పూనుకోవటం ఓ విచిత్రం }  అంబెడ్కర్ గారు   భారత దేశపు రాజ్యాంగాన్ని నిర్మించేటప్పుడు ఈయన సలహాలు ,సూచనలు తీసుకున్నాడు అని భావింపబడుతుంది . బుద్ధిజం లో 22 వాగ్దానాలు ఉంటాయి . భారత దేశములో బుద్ధిజం ను తిరిగి బ్రతికించిన వాడిగాపేరున్న  అంబేద్కర్ఈ  ఈ  22 వాగ్దానాలను కార్యరూపములో ఆచరించి చూపించారు .

హమ్మా లావా సద్ధ తిస్స-  వినయ పిటకము అనే  గ్రంధము లో చెప్పిన సంఘ నియమాలను అంబెడ్కర్ గారికి వివరించి తెలుపగా అంబెడ్కర్ గారు వాటిని మనస్సులో ఉంచుకొని రాజ్యాంగ రచన చేశారు { వినయపిటకము -పాళీ భాషలో వుంది -బౌద్ధ సంఘపు సన్యాసులు , సన్యాసినిలు అనుసరించవలిసిన సంఘ నియమాలను గురించి చెపుతుంది . ప్రతి నియమము రావటానికి వెనుక వున్న మానవ కారణము ఏమిటో కూడా చెపుతుంది }

హమ్మా లావా సద్ధ తిస్స 1957 లో లండన్ వెళ్లి అక్కడ యూనివర్సిటీలలో సింహళ భాష మరియూ బుద్దిస్టు సిద్ధాంతాలను భోదిస్తూ .1990 తాను చనిపోయే వరకూ అక్కడే గడిపారు .అంబేద్కర్ గారు December 6, 1956,న మరణించారు , అనగా ఈయన అంబెడ్కర్ గారు భారత రాజ్యాంగాన్ని రూపొందించటం గురించి పూర్తిగా అవగాహన కలిగి వున్నారు . అంబేద్కర్ గారికి బౌద్ధ దీక్ష ఇచ్చినపుడు ఉన్న 07 వాడైన . భిక్షు గల్గెదర్ ప్రగ్యానంద్, అంబేద్కర్ ను బుద్ధిజం వైపు మళ్లించిన వారిలో అతి పిన్న వయస్కుడు . ఈయన 1942 లో లంకను వదిలి ఇండియా వచ్చి స్థిరపడ్డారు . ఈయన Thursday 30Nov 2017 న లక్నో లో మరణించారు . అంబేద్కర్ని ప్రభావితం చేసి - ఆ బౌద్ధ ప్రభావంతో అంబేద్కర్ భారత దేశానికి ఏమి చేసినదీ ప్రత్యక్షంగా చూసిన వ్యక్తి భిక్షు గల్గెదర్ .{అంబేద్కర్ని ప్రభావితం చేసి-అంబేద్కర్ తద నంతరము కూడా జీవించి వున్నా వ్యక్తిగా ఈయన గుర్తింప పడ్డాడు} .

ఈ వ్యాసముతో పాటు అంబేద్కర్ బొమ్మకి పూలు సమర్పించి భక్తి ప్రకటించు కుంటున్న భిక్షు గల్గెదర్ ప్రగ్యానంద యొక్క ఫోటో జత పరిచాను . బుద్ధుని బోధనలోని విషయాలను అనుసరించి అంబేద్కర్ భారత రాజ్యాంగాన్ని నిర్మించి - బౌద్ధ మతాన్నీ చక్కగా ఆచరించారు అనే గౌరవముతో భిక్షు గల్గెదర్ ప్రగ్యానంద్ అంబేద్కర్ బొమ్మకు పుస్పాలర్చన చేసిన సంగతి ఆ ఫొటోలో

కనపడుతుంది . ఒక బౌద్ధ భిక్షు అంబేడ్కరికి ఎందుకు పూలు సమర్పిస్తాడు ? అని ఆలోచించాలి

చివరకి ఏమిటంటే బుద్ధిజం భారత దేశమును వదిలి పోయింది అని అనుకుంటాము కానీ - నిజానికి అది శ్రీలంక వెళ్లి అక్కడ స్థిరపడి - వేరే వ్యక్తుల రూపాన తిరిగి భారత రాజ్యాంగములోకి ప్రవేశించింది . నేడు మనము రాజ్యాంగ పరిధికి లోబడి వున్నాము అంటే. కొంతలో కొంత మనము బౌద్ధము పరిధికి కూడా లోబడి వున్నాము .
ఈ విషయాలు తెలియని వారు ఎవరైనా ఉంటే వారికి పనికి వస్తుందని అలోచించి -వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి రాసినది.





black and white pohoto Hammalawa Saddhatissa
colour photo is భిక్షు గల్గెదర్ ప్రగ్యానంద్

**3.** చెస్ క్రీడాకారుడు **21-07-24**

ఫుస్కిన్ అనే పిల్లవాడు ఊయల ఊగుతూ కిందకు జారి పడి నేలను గ్రుద్దుకున్నాడు . నుదుటికి బాగా దెబ్బతగిలింది . చిన్న పిల్లల నుదురు పెద్దవాళ్ళకున్నంత గట్టిగా ఉండదు .  ఈ కారణంగా అతడి మెదడు లోని frontal cortex దెబ్బ తిన్నది . ఈ భాగము కోపమును అదుపులో ఉంచే భాగము . అదే దెబ్బతిని పోవటం వల్ల ఫుస్కిన్ కోపాన్ని అదుపులో ఉంచుకో లేకపో ఏ వాడు . తోటి పిల్లలు ఇతనిని గురించి ఫిర్యాదులు చేయటం వల్ల ఫుస్కిన్ తల్లి ఇతనిని మామూలు స్కూల్ నుండి మాన్పించి " మానసిక వికలాంగుల స్కూల్' లో జాయిన్ చేసింది . ఈ నేపధ్యం లో ఫుస్కిన్ తాత మరణించాడు ."చంపటం బ్రతికించటం అనేది దేముడు ఆడే చదరంగపు క్రీడ " అని ఫుస్కిన్ ఊహించుకున్నాడు . ఆపై చెస్ ఆటను బాగా నేర్చుకొని చెస్ లోని పావులను చంపుతూ బ్రతికిస్తూ ఆనందం పొంద సాగాడు .
ఈ ఆనందం తరు వాత "నిజమైన మనుషులను చంపితే ఎలాగుంటుందో ? అనే ఆలోచన ఫుస్కిన్ కి వచ్చింది . తనతో చెస్ ఆడే ఒక మిత్రుడితో తన ఆలోచన పంచు కున్నాడు . ఇద్దరూ కలిసి చెస్ గేమ్ లో వున్న 64 గదులకు గుర్తుగా 64 మందిని చంపి పాతేస్తే సరిపోతుందని నిర్ణయానికి వచ్చారు . ఫుస్కిన్ ఫ్రెండ్ -
చివరిలో దడిచి ఫుస్కిన్ స్నేహాన్ని కాదన్నాడు . అప్పుడు ఫుస్కిన్ ఆ స్నేహితుడిని ఒక పెద్ద పార్కు లోకి తీసుకువెళ్లి అతనిని చంపి , ఆ పార్కులో కుండా పారుతున్న మురుగునీటి ప్రవాహం లో పడేసాడు .ఈ కేసులో పోలీసులు

ఫుస్కిన్ ని అనుమానించించారు కానీ నేరం నిరూపించ లేక పోయారు .
ఇటు తరువాత ఫుస్కిన్ తన ఇంటికి దెగ్గరలోనే వున్న పార్క్ లోకి వెళ్లి " అక్కడ ఏమీ తోచక కూర్చొని వుండే ముసలి వారిని చెస్ అట లోకి లాగే వాడు .చివరన
" ఇవాళ మా కుక్క చనిపోయిన రోజు . ఈ పార్కులోనే పాతి పెట్టాము .దాని సమాధిని చూసి ఆతరువాత కొంత "వోడ్క"{ మద్యము } తాగుదాము అని వారికి ఆస కల్పించి పార్కు లోపలి తీసుకు వెళ్లి వారిని చంపి ఆ మురికి నీటి నదిలోకి తోసి వేసేవాడు . అందరూ చని పోయే వారు కాదు .ఒకరో ఇద్దరో ఎలాగో బ్రతి కి బయట పడ్డారు . బ్రతికి బయట పడిన వారిని చూసిన పూస్కిన్ "నేను చంపిన వాడిని దేముడు బ్రతికించాడు -అంటే మేము ఇద్దరమూ చెస్ ఆడుతున్నాము నేను వేసిన ఎత్తు పారలేదు " అనే ఫీలింగ్ లోకి వెళ్ళాడు . బ్రతికి వచ్చిన వారు ఇచ్చిన సాక్ష్యాన్ని ఆధారం చేసుకొని ఇతనిని అరెస్టు చేశారు అయినా కానీ సరైన సాక్షాలు దొరకక ఫుస్కిన్ ని జైలు నుండి విడుదల చేశారు . ఇంతలో రష్యాలో మరణ శిక్షలపై నిషేధం వచ్చింది . దానితో ఇతడు మరింత రెచ్చి పోయాడు . ఇతడి మీద 24 October 2007 నాటికి 60 హత్యా నేరాలు మోపి విచారించారు . ఇంకో నాలుగు అయితే ? విచారణ సమయం లో ఇతడిపై ఎవరూ దాడి చేయకుండా ఉండేందుకు అని ఇతడిని గాజు అద్దాల వెనుక ఉంచి విచారించారు . చివరిలో ఇతనికి అజీవిత ఖైదు విధించారు . అందులో 15 సంవత్సరాల పాటు అతడు ఒక్కడే ఒక జైలు

గదిలో  కాలం గడపాలి .అని ఈ  చెస్ క్రీడా కారుడి  పై తీర్పు వచ్చింది .

చిన్నప్పటి సంఘటనలు మనస్తత్వాలను రూపొందిస్తాయి ఆంటానికి ఇది ఒక వుడాఆహరణ . మనిషి లోకి ఏదన్నా ఆలోచన ప్రవేశిస్తే . ఆ పని అయ్యిన దాకా
మనస్సు విశ్రాంతి తీసుకోదు ఆంటానికి కూడా ఇది ఉదాహరణ .
----------------------------------

ఇందులో నుండి జెనెరల్ నాలెడ్జి విషయాలు కొన్ని -మొదటిది -పూస్కిన్ పూర్తి పేరు"Yuryevich PUSKIN " <>  రష్యాలో పిల్లలకు పేర్లు పెట్టె విధము ను చట్టము నియంత్రిస్తుంది .రష్యా వారు రొండు రకాలు విధానములో పేర్లు పెడతారు .మొదటి విధానము patronymic, or patronym, సిస్టం . దీనిలో తండ్రి పేరును లేదా తాత పేరును - లేదా కుటుంబానికి మూలమైన వ్యక్తి పేరు ను , ఎక్కువగా తాత పేరును మొగ పిల్లవాడికి  పెడతారు . రష్యాలోని  ప్రతి వ్యక్తికి patronymic పేరు వుండాలని  చట్టము కోరుతుంది . పిల్లవాడి తండ్రి ఎవరైనా విదేశస్థుడు అయితే ఆ సంగతి ఈజీగా తెలియటానికి ఇట్లాంటి ఏర్పాటు పెట్టారు . పిల్లవాడికి తండ్రి ఎవరో తెలియ నప్పుడు తల్లి ఎవరో ఒక మొగవారిని ఒప్పించి వారి పేరును పిల్లాడికి పెట్టుకోవాలి . అదీ కుదరనప్పుడు పిల్లవాడిని కన్న స్త్రీ తన తండ్రి పేరును కొడుకు కు పెట్టాలి . తన తండ్రి పేరు కూడా తెలియని పరిస్థితి కనుక స్త్రీకి వస్తే , ఆమె ఎదో ఒక పురుషుడిని ఎంచుకొని అతని పేరు మొగ పిల్లవాడికి పెట్టి తీరాలి  .

పై విషయాలు అందులోని అషన్స్ , చూస్తే మొగ పిల్ల వాడి పుట్టుకకు కారణం ఎవరో తెలుసుకోవటం రష్యాలో ఒక ప్రాముఖ్య మైన విషయము .
{ నా వివరణ - రష్యాలో ఆడా మోగా ఎవరిని ఎవరైనా ప్రేమించుకో వచ్చు . కానీ మొగ వాడు పెళ్లి అయ్యేదాకా జాగ్రత్తగా లేక పోతే నూ - చివరికి పెళ్లాడకుండా తప్పించుకుంటేనూ అతని పేరు పిల్లాడి పేరుగా మారి అతడి పరువు పోయే ప్రమాదం వుంది . దీనితో మొగవారు ప్రేమ విషయంలో జాగ్రత్తగా ఉండి - ప్రేమించిన అమ్మాయిని పెళ్లాడాక తప్పని పరిస్థితి లో వుంటారు . లవ్వు ఆపై మోసము అనేదానికి ఈ సిస్టం ద్వారా చట్ట బద్దమైన ఒక పరిష్కారం కనుగొన్నారు అని అనుకుందాము}
ఇక రెండో సిస్టం "matronymic " సిస్టం. ఈ సిస్టం లో పుట్టిన ఆడపిల్లకి తల్లి పేరు గానీ అమ్మమ్మ పేరుగానీ, ముత్తమ్మ పేరుగానీ, కుటుంబానికి మూల కారణమైన స్త్రీ పేరు కానీ పెడతారు . ఏది ఏమైనా పుట్టిన ఆడపిల్లను ఎవరు పెంచి పోషిస్తారు/ పోషించాలి అనేదానిని నిర్ణయించటానికి ఈ సిస్టం ఉపయోగిస్తారు .ఈ సిస్టం ప్రకారం ఏ ఆడ పిల్లకూడా అనాధగా ఉండకుండా చట్టబద్దమైన ఏర్పాట్లు జరిగాయి అని అనుకోవాలి . తల్లి తరఫు ఆడవారికి తగిన గుర్తింపు ఇవ్వటం కూడా ఈ సిస్టం లో ఉంది . ఇందువల్ల మనకు రష్యా వారి పేర్లు తగిలినవే తగులుతూ ఉంటాయి.
పుస్కిన్ అనేది ఇంటి పేరు . ఇంటిపేరు అతడు ఈకుటుంబము నుండి వచ్చాడో చెపుతుంది .కుటుంబము పేరు ఆ కుటుంబము వారు ఏ మతము లేదా నాగరికతను అనుసరిస్తూ వుంటారో

తెలుపుతూ ఉంటుంది . ఉదాహరణకు మా ఇంటి పేరు వారణాసి అనగా మా పూర్వీకులు వారణాసి నుండి వలస వచ్చారు అని కాక - మా పూర్వీకులు ఆరోజులలో కాశీలో వుండు బ్రాహ్మణుల పూజలను, నాగరికతను సంప్రదాయాలను అనుసరించారు అని నేను అర్థం చేసుకుంటున్నాను .
రెండు} గతములో USSR అని పిలిచిన ప్రాంతము ముక్కలుగా విడిపోయినాక మిగిలిన ప్రాంతాన్ని "The Russian Soviet Federative Socialist Republic (Russian SFSR or RSFSR "; అని పిలుస్తారు . ఇది మనకు పరిచయం లేని మాట అని భావించి చెప్పాను .
మూడు} - పుష్కిన్ తన హత్యల కోసం వాడుకున్న పార్కు పేరు . Bitsa Park.ఇది రెండు నదుల మధ్య ఏర్పడిన ఫది చదరపు కిలోమీటర్లకు పైగా ఉన్న అరణ్యము . - దీనిని పార్కుగా మార్చారు . పార్కు ఒక అరణ్యము వంటిది కాబట్టి పుష్కిన్ అనేక హత్యలు చేయ గలిగాడు .
నాలుగు} - ఈపార్కుమాస్కో కి పక్కనే ఉంటుంది . కానీ మాస్కోలోని ఒక భాగము కాదు . మాస్కో అధికార పరిధిలో లేని ప్రాంతము . కానీ ఈ పార్కు ఉన్న ప్రాంతానికి చెందిన అధికారులు వారి ఆఫీసులు అన్నీ కూడా మాస్కో లోనే ఉంటాయి . దీనితో తక్షణ పోలీసుల జోక్యం కొరపడటం వల్ల కూడా , పుష్కిన్ అనేక హత్యలు చేయ గలిగాడు .

కొన్ని జెనెరల్ నాలెడ్జి విషయాలను మీతో పంచుకునే ఉద్దేశ్యం తో రాసిన కథ -

పైకధ చదివాక నేను ఇట్లా అనుకుంటున్నాను - పూర్వము మన ఆంధ్ర దేశములో  అమ్మమ్మలూ నాయనమ్మలూ " ఆడపిల్లకి నా పేరు పెట్టుకుంటే నా బంగారము దానికిస్తాను " అని చెపుతూ వుండే వారు . అనగా రష్యా సిస్టం లాగానే ఆడపిల్లకి భవిష్యత్తులో ఏ ఇబ్బందులూ ఏర్పడకుండా కాపుగా వుండే వారు . ఇప్పటి వారు ఈ సిస్టం ను తిరస్కరిస్తూ వున్నాము అనే స్పృహ కూడా లేకుండా  ఏవేవో పేర్లు ఆడ పిల్లలకు పెడుతూ వున్నారు . పిల్లలకు పేర్లు పెట్టే విధానం లో అనుసరించే పద్ధతుల వల్ల కూడా మనము కొన్ని సంప్రదాయాలను  నాశనం చేస్తూ వున్నాము ఏమో ?

బై వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .

**2.**లండన్ లైబ్రరీ మరియూ మనము **19-07-24**

లండన్ లైబ్రరీ ని  Thomas Carlyle   1841,  లో స్థాపించాడు . British Museum Library. యొక్క నియమనిబంధనలకు విసుగు చెంది ఈయన ఒక లైబ్రరీని , జనం కోసం నిర్మించాడు . ఇది ప్రభుత్వపు అధీనంలో లేని స్వతంత్ర సంస్థ . అందులో 1,000,000 ఫది లక్షల కు పైగా పుస్తకాలు వున్నాయి .ప్రతి సంవత్సరము 6000  పుస్తకాలు వచ్చి చేరుతూ ఉంటాయి . భవిశ్య తరాలకు పనికి వచ్చే పుస్తకాలు సేకరించాలి అనే

ఉద్దేశ్యముతో దీన్ని నడుపుతూ వుండటాన ఇది ఇప్పటికీ
మనుగడలో వుంది . దీని ముఖ్య ధ్యేయం విద్యను ముందుకు
తీసుకు వెళ్ళటం, అందరికీ నేర్చుకోవటం, జ్ఞానము పొందటం అనే
అవకాశాము కల్పించటం . ఈ లైబ్రరీ కి కావాల్సిన ధనము అంతా
మెంబర్షిప్ లనుండి మరియూ ఎండోమెంట్స్ నుండి వస్తుంది
{ఎండోమెంట్ అంటే అనేక రూపాలలో లభించే కానుకలు . మనకు
ఎండోమెంట్స్ డిపార్ట్మెంట్ వుందికదా ? దాని అర్థం కానుకల
డిపార్ట్మెంట్ అని. అందు వల్ల రక రకాల దర్శనాలు, ఉత్సవాలు
ప్రవేశ పెట్టి కానుకలు రాబట్టటం ఈ డిపార్ట్ మెంట్ వారి కర్తవ్యం
అవుతుంది . {ఆ కర్తవ్య దీక్షతో , వారు రక రకాల పూజ , దర్శన
టికెట్లు ప్రవేశపెట్టి అడుగడుక్కీ ఒక హుండీ ఉంచుతారు }
ఒక వ్యక్తి తన టాలెంట్ ను కూడా ఈ లైబ్రరీకి కానుకగా అందించ
వచ్చు. ఉదాహరణగా లైబ్రరీ లోకి ధారాళంగా గాలి వచ్చి పోయే
ఏర్పాట్లు చూడ గల టాలెంట్ ఎవరి వద్ద నైనా ఉంటే వారు
లండన్ లైబ్రరీకి వెళ్లి తమకు ఉన్న టాలెంట్ ను కానుకగా
ఇవ్వవచ్చు . అట్లాగే ఏ చదువులూ చదవక పోయినా ప్రకృతి
తమకు ఇచ్చిన టాలెంట్ ని బట్టి - లండన్ లైబ్రరీకి ఏదైనా
చేద్దాము అని వచ్చే వారిని కూడా ఈ లైబ్రరీ స్వాగతిస్తుంది .{ఈ
రెండూ కూడా ఎండో మెంట్స్ కిందకె వస్తాయి - అందువల్ల నే
ఏమో ఎండో మెంట్ డిపార్ట్ మెంట్ వారు కూడా - క్యూలను
అదుపు చేయటానికి - ప్రసాదాలు పంపిణీ చేయటానికి -
వ్యక్తులను ఆహ్వానించి వారి టాలెంట్ ను వాడుకొంటూ వుంటారు
}

ఈ లైబ్రరీ తన వద్ద ఉన్న ఏ పుస్తకాన్ని అయినా బ్రిటన్ లో ఉన్న ఏ చిరునామా కైనా  సరే - పోస్టు ద్వారా, అరువుగా పంపుతుంది . ఈ అరువు పొందే వ్యక్తి మాత్రము ఏదన్న యూనివర్సిటీ కి చెందిన అధికారి కానీ విద్యార్థి కానీ అయ్యి ఉండాలన్నది నియమము . { ఇదే పంధాలో  ఎండో మెంట్స్  డిపార్ట్మెంటు వారు ప్రసాదాలు పోస్టులో పంపుతారు }   పౌర  నాగరికత నశించి పోయిన నాడే లండన్ లైబ్రరీ మూత పడటం జరుగుతుందని డీ నిర్వాహకులు  చెపుతారు .{ఏదన్న ఒక పండగ రోజున . ప్రజలలో భక్తి భావము తక్కువగా కనిపిస్తే దానికి దేవునికన్నా ముందుగా ఎండోమెంట్స్వారే  డీలా పడి పోతారు .}

దీ బ్రిటిష్ లైబ్రరీ

లండన్ లైబ్రరీ వేరు.  ది బ్రిటిష్ లైబ్రరీ  వేరు.   బ్రిటిష్ లైబ్రరీ లో రెండు కోట్ల  పుస్తకాలను  మించి  వున్నాయి . ఇందులో 2000 బీసీ నాటి వ్రాత ప్రతులు కూడా వున్నాయి .ఇది రీసెర్చ్  కి పనికి వచ్చే లైబ్రరీ . దీన్ని  లీగల్ డిపోసిట్ లైబ్రరీ అంటారు .  అంటే - బ్రిటన్ లో పుస్తకాలు అచ్చు వేసేవారు ,ఇతరదేశాలనుండి పుస్తకాలు తెచ్చి బ్రిటన్ లో అమ్మే ప్రతి వారు - తమ ప్రతి పుస్తకాన్నీ ఈ లైబ్రరీలో డిపాజిట్ చేసి  తీరాలిఅని చట్టము . ఆ ప్రకారము ఇక్కడ పుస్తకాలు నిరంతరమూ జమ అవుతూ నే ఉంటాయి  .ఇది ప్రభుత్వ అధీనం లో ఉన్న లైబ్రరీ.   ఏదేశము లోనైనా నేషనల్ లైబ్రరీ అనేది ఉంటే - ఆ దేశము లో అచ్చు పడ్డ

,లేదా అమ్మ బడ్డ ప్రతి పుస్తకము ఆ లైబ్రరీ లో డిపాజిట్ చేయబడుతుంది .

ఇది కాక ది బ్రిటిష్ మ్యూజియం లైబ్రరీ వున్నది . దీనిలో 33,5000 పుస్తకాలు వున్నాయి . ఇది ప్రపంచములో కల వివిధ సంస్కృతి సంప్రదాయాలు కళలను గురించి పుస్తకాలు సేకరిస్తుంది .
ఈ లైబ్రరీలు చదువరులకు పెట్టె షరతులు ఏమిటంటే ? కోట్లు ,బాగులు , పెన్నులు పెన్సిల్స్ , నీరు . తిండి పదార్థాలు , అగ్గి పెట్టెలు మరియూ సెల్ఫోన్లు లోపలి తీసుకో రాకూడదు అని .
జనము యొక్క సాధారణ నమ్మకాలను అగౌరవపరిచే పుస్తకాలను లైబ్రరీలనుండి నిషేదిస్తాబు , అట్లాగే ప్రజలకు అసాధారణ నమ్మకాలను కల్పించ గలవు అన్న పుస్తకాలను కూడా లైబ్రరీ నుండి నిషేదిస్తారు . హారీ పోర్టర్ అనే ఇంగిలీషు పుస్తకం "మ్యాజిక్" గురించి పిల్లలకు అసాధారణ మైన నమ్మకాలు కల్పిస్తుందని భావించి. అది పిల్లల కు అందుబాటులో ఉండకుండా లైబ్రరీలనుండి నిషేదించారు .
కార్టూన్ పుస్తకాలను కూడా లైబ్రరీలలో ఉంచరు. కారణం వాటి లోని పాత్రలు అసాధారణంగా డ్రెస్ చేసు కుంటూ ఉంటాయి , అసాధారణమైన డైలాగులు పలుకుతాయి .కాబట్టి చిన్న పిల్లలు ఈ ప్రభావానికి లోను అవుతారేమోననే భయం చేత కార్టూన్ పుస్తకాలను లైబ్రరీలు అందుబాటులో ఉంచవు.

ఎదో కాలక్షేపం కోసం వారణాసి శ్రీ రామకృష్ణ అఫ్ అమరావతి రచన

**1.**పక్షి రాజు **{**కునాల**}** జాతకము   **15-07-24**

జాతకము అనగా గత జన్మ వృత్తాంతము . బుద్ధుడు బోధిసత్వుడు అని కూడా పిలవ పడతాడు . బోధిసత్వుని అనేక గత జన్మలలో ని  విశేషాలే  జాతక కధలు.

భోధి సత్వుడు ఒకానొక గత జన్మలో ఒక  "కుకూ" పక్షులకు రాజుగా  హిమాలయాలలో జన్మించాడు . ఈ పక్షి రాజు ఎప్పుడూ కూడా ఆడ పక్షుల మందతో కలిసి ఒక వనం లేదా కొండ    నుండి ఇంకో  వనానికి లేదా కొండకి  తిరుగుతూ ఉండేవాడు . మన పక్షి రాజు గారు ఎక్కడికి పోవాలన్నా ఎగరవాల్సిన పని అయితే  . ఎందుకంటే రెండు ఆడ పక్షులు ఒక కర్రను తమ ముక్కులతో పట్టుకొనగా . ఈయన ఆ కర్రపై కూచొని ప్రయాణించేవాడు . ఈ పక్షి రాజు కి కొంచెము కిందుగా  500 ఆడ పక్షులు ఎగురుతూ ఉండేవి . పక్షి రాజు పొరపాటున జారి కింద పడితే అయన నేల మీదకు పోయి పడకుండా చూడటం ఈ పక్షుల పని.  ఇవి కాక కుడి ఎడమల మరియూ పై వైపున  కిందవైపున   ఐదేసి వందల పక్షుల చొప్పున ఎగురుతూ ఉండేవి . తల మీద ఎగిరే పక్షులు తమ రాజుగారికి ఎండ  తగల కుండా చూసేటందుకు అయితే . కుడి ఎడమ పక్షులు రాజుగారికి వడగాలి - లేదా మంచు గాలీ తగలనివ్వ కుండా చూసేందుకు.  ఇవి కాక పక్షి రాజు వెనుక ఇంకో

500  ఆడ పక్షులు ఎగురుతూ ఉండేవి  - అవి రాజుగారికి ప్రేమ కబుర్లు చెప్పటానికి  .  ఇవికాక పక్షి రాజు ముందు ఇంకో 500 పక్షులు ఎగురుతూ ఉండేవి . ఇవి రాజుగారి మీదకు ఎవరూ బాణం వేయకుండా అడ్డుగా ఉండేందుకు  .  ఇవికాక ఆకాశం లోని నక్షత్రాల లాగా చెల్లా చెదురుగా ఎగురుతూ పక్షి రాజును అనుసరించే పక్షులు మరో  ఐదు వందలు వున్నాయి . అవి రాజుగారి కోసము ఆహారాన్ని సంపాదించి తెచ్చి అయన నోటికి అందించే  పక్షులు .
పైన చెప్పిన పక్షులు అన్నీ కలిసి 2502 అయినవి . అన్నీ కూడా ఆడపక్షులే - రాణీ జాతి పక్షులే .ఇవి ఇంటి ఇల్లాండ్ర లాగా ఓర్పుగా  నేర్పుతో  పక్షి రాజు సేవ చేస్తూ ఉండేవి . కానీ పక్షి రాజుగారు వీటిని వూరికే దండిస్తూ ఉండేవాడు . వారి సేవ పట్ల కృతజ్ఞత లేకుండా వుండే వాడు . వారిని చులకన గా చూస్తూ ఉండేవాడు

మన పక్షి రాజు లాగానే ఇంకో పక్షి రాజు వున్నాడు .అయన పేరు "పున్న ముఖుడు"  {పున్న అనగా తెలివి గల  ముఖ అంటే ముఖము కలవాడు } ఈ పున్న మన పక్షి రాజుకు మంచి స్నేహితుడు . పున్న కి కూడా మన పక్షి రాజుకు వున్న రాచ హంగులు అన్నీ కూడా వున్నాయి .అంటే 2502  మంది స్త్రీ పక్షులు ఆయన సేవలో వున్నారు .  కానీ పున్న తన తో పాటు ఎగిరే ఆడ పక్షులను ప్రేమతోనూ కృతజ్ఞతా భావంతోనూ చూసి - వాటి పనులను ప్రశంసిస్తూ ఉండేవాడు .మెచ్చుకుంటూ వుండే వాడు

ఒకనాడు పున్న - నేడు  పక్షి రాజుగా వున్న భోధి సత్వునితో " నీ స్త్రీ పక్షులను ప్రేమతో చూసి వాటితో చక్కగా ప్రవర్తించ వలసింది" అని చెప్పాడు .
అందుకు మన పక్షి రాజు " ఆడ వారిని మన్నించటము - మంచి చేసుకోవటము - మూర్ఖులు చేసే పని "అని కఠిన స్వరంతో బదులిచ్చాడు .

ఒకసారి పున్నముఖుడు బాగా జబ్బు పడి మృత్యువుకి చేరువ అయ్యాడు . "ఏదన్న మందు తీసుకు రండి "  అని  పున్న తన ఆడ పక్షులను పక్షి రాజు భోధిసత్వుడి వద్దకు పంపాడు . మన పక్షి రాజు వారిని తిట్టి " మీరూ మీ రాజు చనిపోవటమే మంచిది " అని పలికాడు . అయినా కానీ కొన్ని మందులు తీసుకుని పున్న వద్దకు వెళ్ళాడు .వెళ్లి పున్నముఖుడితో పాటు కొన్నాళ్ళు వున్నాడు . పున్నముఖుడు జబ్బు పడినందున అతని సేవకులుగా వున్న ఆడ పక్షులు అందరూ విశ్రాంతి తీసుకుంటూ , పున్నముఖుడి సముఖాన లేవు . ఇదే అదనుగా మన  పక్షి రాజు "ఈ ఆడవారి తంతు చూడు . కృతజ్ఞత లేకుండా వున్నారు . వీరిని చూసి నాకు ఎంతో చికాకు వేస్తున్నది " అని పలికాడు .  పక్షి రాజు తనకు ఆడవారి మీద  వున్న కోపాన్ని అక్కసును పున్న ముఖుడికి నూరి పోసాడు . పున్న కూడా " నా  ఆడ పక్షులు నన్ను  విడిచి పోవటం నాకు  కోపం తెప్పిస్తూ నే వున్నది " అని పలికాడు

ఇదే అవకాశముగా పక్షి రాజు " కృతజ్ఞత లేని వారి వల్ల
అందులోనూ కృతజ్ఞత లేని స్త్రీల వల్ల కలిగే దుఃఖాన్ని గురించి
ఉపన్య సించటం మొదలు పెట్టాడు . ఈ ఉపన్యాసము ఇస్తున్నది
భోదిసత్త్వుడే కాబట్టి ఆ ఉపన్యాసము వినటానికి దేవతలు -
మునులు - ఋషులు హిమాలయపు లోయల లో కి వచ్చి
నిలబడ్డారు .

పక్షి రాజు వారి నందరినీ ఉద్దేశించి " స్త్రీలు పురుషుడిని నాశనం
చేయగోరి అతనిని ప్రేమిస్తారు . ఆడ సింహము తన వేటను చీల్చి
నట్లు వారు మొగవారి గుండెలను చీల్చుతారు .వారు విషపు
పాములు . ఎన్నటికీ ఆశ తీరని పిశాచులు .
ఎద్దు కొమ్ముల వంటి వారు . వర్తకుల కు మల్లె తల బిరుసు
వారు. నీటిలో కరిగే విషము వంటి వారు . పొంగే నదుల వంటి
వారు . నీరు నిండిన నూతుల వంటి వారు . మన ము
అనుభవించే శిక్షలు చూసి యమ భటులు ఎంతకూ సంతృప్తి
పడనట్లు - స్త్రీలు పురుషుడి కష్టం పట్ల ఎన్నటికీ సంతృప్తి చెందరు
. పురుషులు స్త్రీలను ఎన్నడూ నమ్మ రాదు " అని పలికాడు .
ఈ సందర్భముగా భోదిసత్త్వుడు తన గత జన్మల లోని మరొక
మరిన్ని గుర్తు చేసుకొని ఇలా చెప్పాడు . " నేను నా గత
జన్మలలో ఒక మానవ రాజుగా పుట్టి ఒక రాచకన్యను పెండ్లి
చేసుకున్నాను . ఆమె పుట్టుక రాచ పుట్టుకే కానీ , కానీ ఆమె
ఒక తీరు ఒక వేశ్య వంటిది .
ఆమెను కన్న తండ్రిని చంపిన వాడు ఆ మెను పెంచాడు . ఈమె
తల్లి తన భర్తను చంపిన వాడికి రాణి గా అయ్యింది . ఈమెకు

స్వయం వరం ప్రకటించారు . ఈ స్వయం వరానికి నేను నా నలుగురు తమ్ముళ్లమూ వెళ్ళాము . విచిత్రంగా ఆమె మా ఐదుగురిని వరించింది . మేముకాక ఆమె సేవకులలో ఒకడు ఆమె కి ప్రియుడు అయ్యాడు . ఈమె తన భర్తలతోనే కాకా సేవకుడితో తో కూడా కూడి నిద్రించేది . వున్నా ఆరు గురికీ కూడా " నా పెంపుడు తండ్రి మరణం తరువాత ఈ రాజ్యము నీదే " అని చెప్పి నమ్మిస్తూ ఉండేది .{ రొండో భాగము వెనువెంటనే }
పక్షి రాజు {కునాల} జాతకము వారణాసి శ్రీ రామ కృష్ణ కధలు



పక్షి రాజు చెప్పిన "సాకాతాపవి" కధ 18-07-24

జాతకము అనగా గత జన్మ వృత్తాంతము . బోధిసత్వుడు అంటే బుద్ధుడే .అని కూడా పిలవ పడతాడు . బోధిసత్వుని అనేక గత జన్మల లో ని విశేషాలే జాతక కధలు.

పక్షి రాజుగా పుట్టిన బోధిసత్వుడు, తన మిత్రుడు ఐన పన్నాముఖునికి "ఆడవారిని మన్నన చేయక వారిని దూరంగా ఉంచాలి " ప్రవచిస్తూ " తాను ఎందుకు ఇలాంటి అభిప్రాయానికి వచ్చినది అన్న దానికి వత్తాసుగా -- తాను గతములో ఒక

మానవ రాజుగా వున్నపుడు ఒక రాచ కన్యను వివాహమాడాను అని చెప్పి . ఇప్పుడు ఆమె యొక్క దుష్ప్రవర్తన గురించి చెపుతూ వున్నాడు .

" మేము అన్నతమ్ముల౦ అందరమూ ఐదుగురమూ కలిసి స్వయం వరానికి వెళ్లగా ఆ రాచకన్య మాఐదుగురిని వరించి మా భార్య అయ్యింది . మేము కాక ఆమెకు సేవకుడిని ప్రియుడిగా గా వుంచు కొంది . " నా తండ్రి మరణం తరువాత నువ్వు నేనే రాజూ రాణీ" అని చెప్పి ఆ ఆరుగురిని నమ్మిస్తూ ఉండేది .

ఈమె ఒకసారి జబ్బు పడింది . ఆరుగురమూ కూడా ఆమె సేవ చేస్తూ వున్నాము . వీరు కాక మరొక గూని వాడు కూడా అక్కడే వున్నాడు . ఈమె అందరివంకా అనగా ఉన్నమా ఏడుగురి వంకా చూస్తూ , ఒకరికి తెలియకుండా ఒకరికి ప్రేమ చూపులు విసిరింది .ఆ చూపులు అందుకున్నవారు " ఈమె నా సొంతము" అనేభ్రమ లో పడుతున్నారు . కానీ బోధిసత్వుడు ఆమె దుష్ప్రవర్తన ను గుర్తించాడు - అందరినీ బయటికి పిలుచుకు వచ్చి " ఆమె చూపులు మీకు ఏమి చెప్పాయి? " అని అడిగాడు . చివరికి ఆమె తన ఐదుగురు భర్తలు, ఒక సేవకుడు మరియూ గూని వాడితో కూడా జత కూడుతున్నదని తేలి పోయింది . దీనితో ప్రతి ఒక్కరి కి ఆమె పై ప్రేమ నశించి - అందరూ కూడా సన్యాసులుగా జీవించేటందుకై హిమాలయాల దారి పట్టారు .

<>>ఈకథలో అంతర్  భాగంగా అనే ఉప కథ సాకాతాపవి ," కధ
<<<>

ఇంకో గత జన్మలో బోధిసత్వుడు ఒక కంసాలిగా జన్మించాడు . ఈ కంసాలి అతని స్నేహితులు ఒక చోట ఒక గుడారం వేసికొని , తిని తాగి ఆనందిస్తూ వున్నారు .
బాగా తాగినాక వారిలో ఒకడు వాంతి చేసుకున్నాడు . అప్పుడు అతని మిత్రులు అతనికి ఏమీ చెడుగు జరగకుండా వుండాలని. మరిన్ని ఆనందాలు లభించాలని  ఆకాంక్షిస్తూ { ఛీరింగ్ హిం అప్ }   " సాకాతాపవి " నిన్ను రక్షించు గాక అని పలికారు .
{నామాట - పూర్వపు రోజులలో సారా/ కల్లు ,
తాగదలుచుకున్నవారు ఊరి చివర ఒక గుడారము వేసుకుని అక్కడికి పోయి తాగే వారని తెలుస్తోంది  . తరువాత  కాలములో గుడారాలకు బదులు వ్యాపారుల  "సారా పాకలు కల్లు పాకలు " ఊరి చివరిలోకి  ఆతరువాత ఊరి మధ్యకు వచ్చాయి }

ఈ " సాకాతాపవి ," ఎవరు అంటే ? తెల్లని వస్త్రాలు ధరించి బెనారస్ స్మశానాలలోని ఒక గుడిసెలో  నివాసము వుండు స్త్రీ . ఈమె తనకు ఐదు భోజనాలు లభించే దాకా వేచి ఉండి అందులో ఎదో ఒక భోజనము మాత్రమే తిను చూ వుండే వ్రతము ఆచరిస్తూ ఉండేది . ఈ వ్రతము గురించి మనము ఇట్లా చెప్పుకోవచ్చు.
"ఒంటరి స్త్రీ స్మశానంలో వున్నది " అన్నజాలితో ఎవరైనా ఒక భోజనము ఇచ్చి పోయేవారు . ఇట్లా ఐదుగురు ఇచ్చే దాకా ఆగి అందులో ని ఒక భోజనాన్ని మాత్రమే తినేది . మంచి భోజనము

చేతిలో వున్నపుడు కూడా ఐదో భోజనము వచ్చేదాకా జిహ్వాను అదుపు చేసుకోవటం సాధారణ విషయము కాదు . {2} ఇది కాక "మేము ఇచ్చిన భోజనం ఆమె తింటుందో లేదో" అనే ఆలోచన జనులలో కలిగినపుడు - ఎవరూ కూడా ఆమెకు మొదటి భోజనం ఇవ్వరు . మొదటి భోజనం లేనపుడు ఐదో భోజనం ఎక్కడినుండి వస్తుంది ? ఎప్పటికి తినగలుగుతుంది ? అనగా ఒక్కో సారి చాలా రోజులు పాటు పస్తులు వుండవలిసి రా వచ్చు .అలా ఈ వ్రతము కఠిన వ్రతము .{3} ఈ కధా సందర్భాన్ని పట్టి , సాకాతాపవి -వరుసగా ఐదు భోజనాలు తిని అందులోని నాలుగు భోజనాలను కక్కి వేస్తూ ఉంటుంది అని కూడా ఊహించ వచ్చు , ఈ వ్రతము కారణంగా "సాకాతాపవి" కాశీ అంతటా గౌరవము పొందిన స్త్రీ అయ్యింది .
" సాకాతాపవి " నిన్ను రక్షించు గాకఅని తోటి వారు పలికినాక కక్కుకున్నా కక్కి గాడు " నన్ను "సాకాతాపవి" అనుకుంటూ పూజించండి " అని కూశాడు . వీడి ఉద్దేశ్యము "నాకు దొరికిన భోజనాలలో ఓ భోజనాన్ని మినహాయించి అన్ని బోజనాలను, ఆ "సాకాతాపవి" లా బయటకు తోసాను అని . అప్పుడు వాడి మిత్రులలో మరొకడు "
"తిండిమానివేసే ఆడది అంటూ ఉండదు కావాలంటే వేయి బంగారు నాణేలు పందెము " అని పలికాడు . కక్కు కున్న కుక్కీ గాడు ఆమరునాడు ఓ సన్యాసి వేషము వేసుకొని "సాకాతాపవి" గుడిసె వద్దకు వెళ్లినుంచుని సూర్యునికి దణ్ణాలు పెట్టసాగాడు . "సాకాతాపవి" ఇతడిని అర్చించి పూజించింది . కానీ ఒకరినొకరు పలకరించుకో లేదు . ఇట్లా నాలుగు రోజులు గడిచాక కుక్కీ గాడు

"సాకాతాపవి" ని పలకరించకుండా ఉండలేక పోయాడు . అప్పుడు "సాకాతాపవి" ఓ సన్యాసీ నీవు ఏ మోక్ష మార్గము ను అనుసరిస్తున్నావు? అని అడిగింది. "నీకన్నా గట్టి వ్రతము ఆచరిస్తూ వున్నాను అని" కుక్కీ గాడు బదులిచ్చాడు . కుక్కీ గాడి ముఖాన ఏ విధమైన జ్ఞ్యానపు కాంతి లేక పోవటంతో "సాకాతాపవి" అతడిని సందేహించి అదే అడిగింది ." నాకు శాంతి దొరకలేదు అని కుక్కీ గాడు పలికాడు . " నాకు కూడా ఏమీ శాంతి దొరకలేదు " అని "సాకాతాపవి" తన మనో భావం చెప్పుకుంది . అప్పుడు కుక్కీ గాడు ఆమెకు మోక్ష/శాంతిని పొందే మార్గము చూ పిస్తానని నమ్మ పలికి ఆమెను తాగుబోతుల గుడారానికి తీసుకువచ్చి . ఆమెచే తాగించి , ఆమెను మిత్రుల తో కలిసి పంచుకున్నాడు . మోసకారుల మాటలను స్త్రీలు సులభంగా నమ్ముతారు - వారి వెంట పోతారు కాబట్టి వారికా అదృష్టము పట్టింది .

ఈ కధ లో నీతి ఏమీ లేదు .{1} స్త్రీలు - నిజాయితీతో వ్యవహరించే వారిని కాక మోసకారులనే ఎక్కువుగా నమ్ముతారని చెప్పటమే ఈ కధా ఉద్దేశ్యము .

{2} తాగిన వారు ఒకరికి ఒకరు ఆకాంక్షించే అదృష్టము ? " నీకు మంచివ్రతాలు ఆచరించే సాకాతాపవి"వంటి స్త్రీ పొందు దొరకాలి అని .

ఈ రోజున మన వారు చెప్పుకునే చీర్స్ కి అర్ధం "నీకు ఆనందోత్సాహాలు కలగాలి అని ". ఈ ఆనందోత్సాహాలలో స్త్రీ పొందు కూడా ఒక భాగము } .<><> ఇక్కడికి సాకాతాపవి" కధ సమాప్తము <><>

కంసాలిగా జన్మించి తన మిత్రులతో కూడి మద్యం తాగుతూ ఉన్న భోధి  సత్వుడు పైకధను వివరించి , ఇంకా చెబుతూ  -  "తెల్లని వస్త్రాలు ధరించి వ్రతాలు ఆచరించే స్త్రీ "సాకాతాపవి"వంటిది - తాగు బోతు వలే స్థిరంగా నిలబడలేనిది  , రోజుకు ఒక రొండు  బంగారు నాణేలు ఇస్తే - మంచి దుస్తులు వేసుకుని వచ్చి ఆడుతూందీ పాడుతుందీ ".అని స్త్రీల పై తనకు గల చులకన భావాన్ని వెలిబుచ్చాడు .

ఇటు తరువాత  కంసాలిగా పుట్టి ఉన్న బోధిసత్వుడు -"సాకాతాపవి" గుడిసె వద్దకు స్వయంగా వెళ్ళాడు . బోధిసత్వుడు కూడా సన్యాసి రూపములోనే "సాకాతాపవి"  వద్దకు  వెళ్ళాడు . అనేక శవ దహనాల మధ్య నిలబడిన భోదిసత్వుని చూసిన "సాకాతాపవి" అతడు ఎంతో సాధించిన జ్ఞ్యాని అని ఊహించింది . సాధన గురించిన వివరాలు అడిగింది . భోధి సత్వుడు తన గురించి అన్నీ అసత్యాలు చెప్పాడు .   ఆరు రోజుల కాలము గడిచాక - భోధి సత్వుడు " "సాకాతాపవి" ఎటువంటి ఫలితము పొందకుండానే , 12 ఏండ్ల క్రితమే " బోజనాలను తృణీకరించటం అనే వ్రతము మాని వేసిందని తెలుసు కున్నాడు .   అప్పుడు బోధిసత్వుడు  నేను నిన్ను పెండ్లాడి మళ్ళీ గృహస్తును అవుదాము అనుకుంటున్నాను అని చెప్పాడు . "సాకాతాపవి" కి భోధి సత్త్వునికి పెళ్ళిఅయింది  . భోధి సత్వుడు ఆమెను పాన సాలాలకూ  జూదశాలకు కూడా తీసుకు పెడుతూ ఉండేవాడు . భోధి సత్వుడు విలువైన మనిషి అని గ్రహించ గలిగినప్పటికీ - సాకాతాపవి   విషయలోలత వైపు మాత్రమే మొగ్గు చూపుతూ జూద  శాలకు కూడా తిరిగింది కానీ . భర్త గొప్పతనము ఏమిటో

గ్రహించి దానినుండి లబ్ది పొందే ప్రయత్నం చేయలేదు . స్త్రీలు విషయ లోలు రు మరియూ సుఖ లోలు బు మాత్రమే కానీ జ్ఞనాన్ని కోరే వారు కాదు అని దీని భావము. ఇలాంటి అనుభవాల వల్ల , పక్షి రాజుగా భోదిసత్వుడుకి స్త్రీ పట్ల అనేక నిరసన భావాలు ఏర్పడి వున్నవి .ఆ విషయాలే పన్న ముఖుడికి చెప్పాడు .
పక్షి రాజు గా ఉన్న భోధి సత్వుడు చెప్పిన పై ప్రసంగాలను / కధలు విన్న దేవతలు మునులు చప్పట్లు చరిచారు . పక్షి రాజు జ్ఞనాన్ని కొనియాడారు . అప్పటి వరకూ బౌద్ధ సన్యాసినిగా ఉండటమా ? గృహస్త అస్రంలోకి మళ్ళీ వెళ్లటమా ? అనే డోలాయమాన స్థితిలో ఉన్నవేలమంది బౌద్ధ సన్యాసులు, తమ భార్యల మీద కల వ్యామోహాన్ని పూర్తిగా వదులు కున్నారు . పన్న ముఖుడు కూడా తన మనసు మార్చుకున్నాడు . స్త్రీలను ప్రేమించకుండా దూరంగా నెట్టటం, మోక్ష సాధనకు ఒక మార్గము అని దానినే పక్షి రాజు అనుసరించాడు అని తెలుసు కున్నాడు . భోది సత్వుడు ఈ కథ " స్త్రీలనువారి మనసులను నిందించటం కోసం కాక--తన శిష్యులను గృహస్థాశ్రమము నుండి సన్యాసం ఆశ్రమము వేపు స్థిరంగా మళ్లించ టము కోసమే చెప్పాడు అను కోవాలి .
రచన వివరణ వారణాసి శ్రీ రామ కృష్ణఅఫ్ అమరావతి